పల్లెటూరి ఆటపాట, సోగ్గాడి సోకుబాట



సురేష్ ప్రొడక్షన్స్

# సోగ్గాడు

ఈస్ట్‌మన్‌కలర్

నిర్మాత
డి. రామానాయుడు

దర్శకత్వం: కె. బాపయ్య

ఆంధ్ర-సీడెడ్: నవయుగ
నైజాం: విజయా సురేష్ పిక్చర్స్

NVKR

భాస్కరరావు & బ్రహ్మయ్య సమర్పించు పద్మజయ ప్రొడక్షన్స్ వారి

# వజ్రాల దొంగ

ఈస్ట్మన్ కలర్




I.కుమారస్వామి-M.సత్యం

దర్శకత్వం: P నీలకంఠన్

విజయా రిలీజ్

VIJAYA

తప్పక చూడండి!

హీరా రామకృష్ణ సమర్పించు

శ్రీ విఠల్ ప్రొడక్షన్స్ & కో వారి

# కోటలో పాగా

2వ యూనిట్ దర్శకులు

జి. విశ్వనాథ్, వైకుంఠరామ శర్మ

నిర్మాత-దర్శకత్వం:

బి. విఠలాచార్య

మాటలు: జి.కె. మూర్తి B.A.



ఆంధ్ర: పూర్ణా పిక్చర్స్ : చిత్తూరు: కృష్ణవేణి పిక్చర్స్ : కడప: శ్రీ శివశంకర్ ఫిలిం డిస్ట్రిబ్యూటర్స్

అనంతపురం, కర్నూలు, బళ్లారి: జయలక్ష్మి పిక్చర్స్

## లోకంపోకడ











**ఆంధ్రసచిత్రవారపత్రిక**

వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం . 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938 - 1972)
శుక్రవారం : 16-1-'76
రాక్షసనామ సం. పుష్యమాస శు. చతుర్దశి
*సంపుటము : 69 సంచిక : 19*
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ
★
సంవత్సర చందా - రు 33-80
ఆరుమాసాల చందా - రు 16-90
విడిప్రతి వెల 60 పైసలు
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ-520003


## విషయానుక్రమణిక

## మన లో మాట

అందరికీ మా సంక్రాంతి శుభాకాంక్షలు

*1976* ఫిలిం బ్యాలట్ పత్రం దీనితోపాటు ఇస్తున్నాము. ఈసారి పాఠకులు తమ తమ అభిమాన చిత్ర నటీ నటుల వివరాలను యీ క్రింద పేర్కొన్నవరుసలో విడిగా వ్రాసి, దానితోపాటు యీ బ్యాలట్ పత్రాన్ని కత్తిరించి జతచేసి పంపవలసిందిగా కోరుతున్నాము (1) ఉత్తమ చిత్రం (2) ఉత్తమ నటుడు (3) ఉత్తమ నటి (4) ఉత్తమ దర్శకుడు (5) ఉత్తమ సంగీత దర్శకుడు (6) ఉత్తమ సహాయ నటుడు (7) ఉత్తమ సహాయనటి (8) ఉత్తమ హాస్య నటుడు (9) ఉత్తమ హాస్యనటి పై అంకెలను వేస్తూ ప్రక్కనే మీ నిర్ణయంలో ఎవరెవరు ఉత్తములో వ్రాయండి దానికి బ్యాలట్ పత్రం మాత్రం కత్తిరించి తీసి జతచేయండి. మీ పేరు, చిరునామా తప్పక వ్రాయాలి. బ్యాలట్ పత్రం జతచేయని పత్రాలు పరిగణనలోనికి తీసుకోడం సాధ్యంకాదు.

*ముగింపు తేదీ: 16-2-76*

అటు తర్వాత అందిన బ్యాలట్ పత్రాలను లెక్కించడం జరుగదు. పాఠకుల సౌకర్యార్థం యీ సంచికలోనే '75 సినిమాల జాబితా, దర్శకుల, సంగీత దర్శకుల జాబితాలను చేర్చాము. ఎప్పటిలాగే యీసారిగూడ బ్యాలట్‌లో విరివిగా పాఠకులు పాల్గొంటారని ఆశిస్తున్నాము

*   *   *

ఆలస్యంగా అందిన కారణంగా హైదరాబాద్ నోట్‌బుక్‌ను యీ సంచికలో వేయలేకపోతున్నాము ఈ వారం సినిమా శీర్షికలో యించుమించు అన్నీ ప్రత్యేక వ్యాసాలనే వేశాము మా పాఠకులకి నచ్చుతాయని అనుకుంటున్నాము

ఇప్పుడు పడుతున్న మిణుగురులు దీపావళి సీరియల్ కథలలో చివరిది. ఇది పూర్తికాగానే, పాఠకులకి వ్యాసరచన పోటీ ప్రకటిస్తాము.

చోటు చాలని కారణంగా ఈసంచికలో కొన్ని మామూలు శీర్షికలను ఎత్తివేయటమో లేక కుదించటమో జరిగింది. పై వారం నుంచి మామూలు శీర్షికలన్నీ ఎప్పటివలె వుంటాయి

..ఇలా కత్తిరించండి..

**ఆంధ్రసచిత్ర వారపత్రిక**

**1976 తెనుగు ఫిలిమ్ బ్యాలట్ ప్రవేశ పత్రం**

దీన్ని జతచేసి పంపని బ్యాలట్ పత్రాలు చెల్లవు

(సం.)

..ఇలా కత్తిరించండి..

# 1975 లో విడుదలైన డైరెక్టటేక్ తెలుగు చిత్రాలు

1. శ్రీ రామాంజనేయ యుద్ధం 2. దేవుడు చేసిన పెళ్లి, 3. రామయతండ్రి, 4. పండంటి సంసారం, 5. మొగుడా? పెళ్లామా?, 6.జమీందారుగారి అమ్మాయి, 7. యశోదకృష్ణ, 8. పరివర్తన, 9. చదువు సంస్కారం, 10. కథానాయకుని కథ, 11. అభిమానవతి, 12. చిన్ననాటి కలలు, 13. రాజ్యంలో రాబందులు, 14. ఆడదాని అదృష్టం, 15. భాగస్తులు, 16. పుట్టింటి గౌరవం, 17 అమ్మాయిలు జాగ్రత్త, 18 భారతి, 19. అందరూ మంచివారే, 20 సినిమా వైభవం, 21. కొత్తకాపురం, 22. సౌభాగ్యవతి, 23.బాబు, 24. అమ్మ, 25. మాయామశ్చీంద్ర, 26, జీవనజ్యోతి, 27. అనురాగాలు, 28. సంసారం, 29. అమ్మాయిల శపథం, 30 చల్లనితల్లి, 31. రాముని మించిన రాముడు, 32. అన్నదమ్ముల కథ, 33. అన్నదమ్ముల అనుబంధం, 34. చీకటి వెలుగులు, 35 బలిపీఠం, 36. ముత్యాలముగ్గు, 37. నాకూ స్వతంత్రం వచ్చింది, 38. జేబు దొంగ, 39. రక్తసంబంధాలు, 40. పూజ, 41. మాపూరి గంగ, 42. లక్ష్మణరేఖ, 43. దేవుడే దిగివస్తే, 44. వైకుంఠపాళి, 45 తీర్పు, 46. భారతంలో ఒక అమ్మాయి, 47. పిచ్చోడి పెళ్లి, 48. గాజులకిష్టయ్య, 49. వయసొచ్చిన పిల్ల, 50. సంతానం సౌభాగ్యం, 51. తోట రాముడు, 52. చిట్టెమ్మ—చిలకమ్మ, 53.గుణవంతుడు, 54. దేవుడులాంటి మనిషి, 55. స్వర్గం—నరకం, 56. ఈ కాలం దంపతులు, 57. బుల్లెమ్మ శపథం, 58. ఎదురులేని మనిషి, 59. సోగ్గాడు

## దర్శకులు

1. ధాసరి నారాయణరావు, 2. పి. సి. రెడ్డి, 3.కె. బాపయ్య, 4. బాపు, 5. బి. వి.ప్రసాద్, 6. సి. ఎస్. రావు, 7. యోగానంద్, 8.శేషగిరి రావు, 9. కె. ఎస్. రామిరెడ్డి, 10. డి. ఎస్. ప్రకాశరావు, 11. లక్ష్మీదీపక్, 12. ఆదుర్తి సుబ్బారావు, 13. టి. రామారావు, 14. బి. ఎ. సుబ్బారావు, 15. ఎస్. శ్రీనివాసరావు, 16.కె. హేమాంబరధరరావు, 17. రాజశ్రీ, 18. డూండి 19. టి. లెనిన్‌బాబు, 20. కె. ఎస్. ప్రసాద్, 21. భీమ్‌సింగ్, 22. పి. సాంబశివరావు, 23. పీటూరి, 24. ఎస్. ఎస్. బాలన్, 25. పద్మనాభం, 26. కె. రాఘవేంద్రరావు, 27. బాబూభాయి మిస్త్రీ, 28. కె. విశ్వనాద్, 29. టి. ప్రకాశ రావు, 30. ఎం. ఎస్. గోపీనాథ్, 31. ఎస్. డి. లాల్, 32. కె. ఎస్. ప్రకాశరావు, 33. వి. మధుసూధనరావు, 34. ఎం. మల్లిఖార్జునరావు, 35. మురుగన్ కుమరన్, 36. కె. ఎస్. ఆర్. దాస్, 37. ఎస్. గోపాలకృష్ణ, 38. యు. విశ్వేశ్వరరావు 39. కె. ఎస్. రెడ్డి, 40. పి. బ్రహ్మానందరావు, 41. విజయ్, 42. ఎం. ఎస్. మూర్తి.

## సంగీత దర్శకులు

1. సత్యం, 2. మహాదేవన్, 3. చక్రవర్తి, 4. టి. చలపతిరావు, 5. ఎస్. రాజేశ్వరరావు, 6. ఎస్. హనుమంతరావు, 7. కోదండపాణి, 8. రమేష్ నాయుడు, 9. జి. కె. వెంకటేష్ 10.ఎ కుమార్, 11. విజయభాస్కర్, 12. రాజన్ నాగేంద్ర, 13. వి.శంకర్, 14. యార్లగడ్డ, 15.సుసర్ల—పామర్తి.

సేకరణ : శ్రీ కాట్రగడ్డ నరసయ్య

# పొంగళ్ల పండుగ

పంటలు పండి ఇళ్ళు చేరుకోగా జరుపుకునే తొలి పండుగే పొంగళ్ల పండుగ. ఇదే పెద్ద పండుగ దీన్నె తమిళులు 'పొంగల్' అని వ్యవహరిస్తారు పండుగ అంటే ఏమిటి? మనస్సుకు సంతోషాన్నీ, సంతృప్తినీ కలిగించే మంచి సమయం పుట్టిన రోజు పండుగ జరుపుకోవడం పరిపాటేగదా! ఆ విధంగానే ఈ పండుగ ఎంతో ఉత్సాహాన్నీ సంతృప్తినీ కలిగిస్తుంది.

ప్రాణుల పుట్టుకకూ పుట్టినవి జీవించుటకూ తిండి ఎంతో అవసరం. తినబడేదే అన్నం! వేదాలలో కూడా 'అన్నాత్ ఖల్విమాని భూతాని జాయన్తే; జాతా న్యన్నేన జీవంతి' అని చెప్పబడి ఉన్నది. ఆ అన్నానికి ఆధారమైన పంటలు సమృద్ధిగా పండి ఇంటికి రావడం ఈ పండుగకు ముందే!

సూర్యుని గమనాన్ననుసరించి సంవత్సరంలోని పన్నెండు నెలలూ దక్షిణాయనం, ఉత్తరాయణం అని రెండు భాగాలుగా విభజించబడినవి. ఆషాఢం నుంచి పుష్యమాసంవరకూ దక్షిణాయనం. పుష్యంనుంచి ఆషాఢమాసం వరకూ ఉత్తరాయణం. దక్షిణాయనంలో పొలాలు దున్ని సరిచెయ్యడం విత్తనాలు చల్లి నీరుపెట్టి పంటకు దోహదం చెయ్యడం దాన్ని భద్రంగా కాపాడడం జరుగుతుంది. ఇదంతా శ్రమతో కూడిన పని. వర్షాలు పడుతూ ఉండడంవల్ల అటు పనులకూ, ఇటు గృహకృత్యాలకూ మిక్కిలి ఇబ్బందిగా ఉంటుంది. మనస్సుకు ప్రశాంతి ఉండదు. పుష్యమాసం వచ్చేసరికి చిక్కులన్నీ తీరిపోతాయి. వర్షాలు నిలిచిపోతాయి. బాడి, బురద ఎండబారుతుంది. తమ పరిశ్రమకు ప్రతిఫలమైన పంట ఎంతో సంతృప్తిని కలిగిస్తుంది ఆనందం కలుగుతుంది. పండుగ చేసుకోవాలనే సంకల్పం కలుగుతుంది. అట్టి సంకల్పఫలితమే 'పొంగళ్ల పండుగ'

మనం దేనిమీద ఆధారపడి ఉంటే దానిని అభినందిస్తూ ఉత్సవం చేసుకోవడం ఒక సంప్రదాయం పాడిపశువులపై ఆధారపడి ఉన్న గోపకులు వాటికి కావలసిన తృణ, జల సమృద్ధికి కావలసిన వర్షాలను కురిపించే ఇంద్రుణ్ణి కొనియాడుతూ ఇంద్రోత్సవం చేసుకుంటూ ఉండేవారని భాగవతాన్ని బట్టి తెలుస్తూ ఉన్నది ఆ రీతినే తమ జీవనానికి ఆధారమైన పంటలు తమ ఇలవేల్పుల అనుగ్రహంవల్లనే పండుతున్నవని అమాయకులైన రైతుల అభిప్రాయం. అందువల్ల వారు తాము పండించిన కొత్త పంటను తొట్టతొలుత తమ అభీష్ట దైవాలకు సమర్పిస్తారు. కొత్త ధాన్యం దంచి, పొంగళ్ళు వండి నివేదిస్తారు. సస్యదేవత ప్రీతికయి పొలాలలో చల్లుతారు కొత్త చెఱకులు గానుగాడిన కొత్త బెల్లం ఆ పొంగళ్లకు వినియోగిస్తారు ఇలా చేస్తేనే వారికి తృప్తి దేవతలకు నివేదించిన పొంగళ్లను బంధువులతో కలిసి తినినప్పుడే వారికి ఆనందం. ఇది దక్షిణదేశంలో అనాదినుంచీ వస్తూవున్న ఆచారం.

ఈ పండుగ విశేషమేమిటంటే — దీనికి ముందు నెల రోజుల నుంచీ కూడా ప్రతి దినమూ పండుగలాగే ఉంటుంది. దీనికి ముందునెల సౌరమానం ప్రకారం ధనుర్మాసం. చలి విపరీతంగా ఉండేకాలం. శీతబాధ మనుషులను ధనుస్సు మాదిరిగా వంచివేస్తూ ఉంటుంది. అంత చలిలోనూ కూడా జనం కోడి కూతకు ముందే లేచి, కాలకృత్యాలు తీర్చుకుని స్నానంచేసి విష్ణునామ సంకీర్తనం చేస్తూ పాటలు పాడుతూ ఊరు చుట్టివస్తారు. ఇది వారి సహనభావాన్నీ, మనోనిగ్రహాన్నీ, భక్తిభావాన్నీ సూచిస్తుంది. ప్రతీఇంటిముందూ గొబ్బిళ్ళు పెట్టిన చిత్ర విచిత్రాలయిన ముగ్గులు వారికి స్వాగతం చెప్తూ ఉంటాయి ఇలా ఊరు తిరిగి, భక్తులనందరినీ కూడదీసుకునివారు దేవాలయానికి పోయి భగవత్సన్నిధానంలో కొంతసేపు సంకీర్తనను సాగిస్తారు తర్వాత పూజలో పాల్గొంటారు. పూజానంతరం నైవేద్యంపెట్టిన వేడివేడి పొంగళ్లను — భగవత్ప్రసాదం స్వీకరించి తమ తమ నివాసాలు చేరుకుంటారు ఇది ఉదయం కార్యక్రమం. సాయంకాలం దేవాలయానికి పోయి పూజలో పాల్గొని పురాణశ్రవణం చేస్తారు ఒక్కొక్కపుడు హరికథా కాలక్షేపాలు, సంగీత కచేరీలు జరుగుతూ ఉంటాయి భక్తిప్రభావాన్ని వెల్లడించే ఉపన్యాసాలు కూడా ఏర్పాటు చెయ్యబడతాయి ఈ నెల రోజులూ ఎంతో సందడిగా వుంటుంది

ఈ ఉత్సవాలు ఎలా వచ్చాయంటే—

పూర్వకాలంలో దక్షిణదేశంలోని శ్రీ విల్లిపుత్తూరులో నివసిస్తూ ఉండిన హరిభక్తుడు పెరియాళ్వారు కుమార్తె గోదాదేవి మానవమాత్రుణ్ణి వివాహమాడనొల్లక విష్ణుదేవుని అవతారమూర్తి శ్రీరంగనాథుని వివాహమాడవలెనని పట్టుదలతో ఉండినది ఆమె వెనుకటి జన్మలో భూదేవియట! భగవదనుగ్రహం సంపాదించడంకోసం ఆమె ధనుర్మాసం నెలదినాలు పయివిధంగా నియమంతో వ్రతంచేసి కృతార్థురా లయినదట! ఆమె రచించిన తిరుప్పావు అనే చిన్న విష్ణుస్తుతి కావ్యం తమిళవాఙ్మయంలో మిక్కిలి ప్రఖ్యాతమైనది దాని తర్జుమాలు తెలుగులో చాలా ఉన్నవి.

"ఆంగీరస"



దీపావళి పోటీ సీరియల్ కథ

# మిణుగురులు

(గత సంచిక తరువాయి)

'ఏమిటండీ తెనాలి కబుర్లు? పాపం మీ మరదలు చివరిసారిగా పెనిమిటని చూసుకోటానిక్కూడ నోచుకోలేదు'

'పెన్షను కాగితాలు తొరగా హైద్రాబాదు నుంచి తిరిగి రాలేదుట, వాటి విషయం తెల్సుకుందామని అక్కడికి వెళ్లి తిరిగి వస్తుండగా ఈ దిక్కుమాలిన చావు ఎదురైంది.'

'ఎవరు ఎంత చేసుకుంటే అంత. కాగితాలు ఎప్పటికైనా వచ్చేవేగా అంతలో అంత ఆత్రం ఎందుకో!'

'శవాన్ని ఇంటికి తీసుకొచ్చే వీలుకూడా చిక్కలేదని ప్రభాకరం చెప్పాడు. రైలు కింద పడి బాగా నలిగిపోయిందిట శవం! ప్రమాదం జరిగిన ప్రాంతంలోనే అన్ని శవాలతోపాటు పూడ్చిపెట్టారుట.'

'శాంతమ్మ పసుపు కుంకుమ అక్కడ మట్టిలో కలవాలని రాసిపెట్టాడేమో బ్రహ్మ మరి.'

'ఇంతకీ వాడు అదృష్టవంతుడు. ఈ సంసారభారం తప్పించుకుని బయటపడ్డాడు'

'అన్నట్టు పాపం ఇప్పుడు ఆ సంసారం గతేంకాను? అల్లుడు ప్రభాకరం చూద్దామా అంటే అతగాడికి చిల్లి గవ్వ కూడ సంపాదన లేదాయె! పిల్లలు చదువుకుంటున్నారాయె!'

'ఏమో మనకెందుకులే! పాపం అంటే వచ్చి మెడకు చుట్టుకుందిట.'

'అదికాదండీ! కొంప ఒకటి ఉంది గదా. డబ్బుకూడ ఏమన్నా మిగిల్చిపోయాడేమో లెండి.'

'అవన్నీ మనకు తెలుస్తాయా ఏమిటి. ఆ అల్లుడూ అత్తగారూ పిల్లలూ ఏదైనా పైకి పొక్కనిస్తారా అంతా గుంభనం'

'మొదట్నుంచీ అంతేకదండీ మీ తమ్ముడి తీరు. వాళ్ల మనసుల తీరే అంత! ఇంతెందుకు తన జీవితంలో ఎప్పుడైనా ఒక్కసారైనా పిల్చి రెండు గుడ్డముక్కలు పెట్టి ఆదరించేడా ఎప్పుడూ మనంపోయి కరుచుకోవటమేకాని.'

'అయినా నీ పిచ్చికాని ఒకళ్ల మనకు పెట్టేదేమిటి! మనకేంతక్కువని.'

'అదికాదండీ. ఆ పిల్ల ముండల్ని చూస్తుంటే నాకు జాలేస్తుంది, వీళ్లెట్టా బతుకుతారా అని.'

'వాళ్ల గొడవేదో వాళ్లు పడతార్లే నీకెందుకూ ఉట్టినే బెంగ.'

'ఆ ఆఖరిపిల్ల లేదుటండీ పద్మ! పోనీ దాన్ని మనం పిలిపించుకుందామండీ! మనకూ ఎవరున్నారని. అందులో నాకూ చాకిరీచేసే ఓపిక రోజు రోజుకీ క్షీణించిపోతోంది.'

'ఓహూ అదా నీ పథకం! ఇదో ఇందాకే చెప్పానుగా పాపం అంటే వచ్చి మెడకు చుట్టుకుంటుందని, ఇప్పుడు వాళ్ళని ఒకర్ని చేరదీశామంటే ఆ తంబ తంబా వచ్చి మన సంసారాన్ని గుల్ల చెయ్యరూ!'

'అవున్లెండి మీకేం! దాసీదాన్ని నేనున్నాగా కొంపలో, చాకిరిచేసి చావటానికి! నే నెలా బుగ్గయిపోతే మీకెందుకూ.'

సీతమ్మ చివరిసారిగా ఆ మాటలని బుడి బుడి దీర్ఘాలుతీస్తూ చీరచెంగుతో కన్నీళ్లు అద్దుకోసాగింది ఉన్నట్లుండి అర్ధాంగి చిత్తప్రవృత్తి మారి మళ్లా మొదటికొచ్చినందుకు చింతిస్తూ ఆవిడని కొంచెం శాంతింప జేద్దామని 'నువ్వనేది పద్మని తెచ్చుకుందామనేగా. సరే అలాగే నీ ఇష్టంవచ్చినట్లు కానీ!' అన్నాడు శేషయ్య!

**జరిగినకథ 1 :** చిన్నతనం నుంచి పెంచి పెద్దచేసి అల్లుడ్నిగా చేసుకున్న జగన్నాధంగారి మరణంతో కుటుంబబారం మోయడానికి ప్రయివేట్లు చెప్తుంటాడు ప్రభాకరం. ప్రభాకరం స్నేహితుడు ప్రకాశం. వుద్యోగంకోసం హైదరాబాద్ వచ్చిన ప్రకాశానికి నిరుద్యోగిని ప్రభావతితో పరిచయ మవుతుంది.

సీతమ్మ ముఖంలోకి కొత్తవెలుగువచ్చింది.

'అయితే రేపే ఉత్తరం వ్రాయండి' అంటూ అక్కణ్నుంచి బయల్దేరి మూలుగుతూ ఇంట్లోకి నడిచింది సీతమ్మ!

శేషయ్య ప్రయాణం చేసి వచ్చిన బడలికతో బద్ధకంగా వళ్లు విరుచుకుంటూ వరండాలో ఉన్న వాలు కుర్చీలో కూచుని చిన్న కునుకు తీయటానికి ఉపక్రమించేడు!

## 4

తెల్లవారుతోంది. చీకట్లను తోసుకుంటూ కాంతి కిరణాలు వ్యాపిస్తున్నాయి లోకమంతా! శాంతమ్మ భగవధ్యానంతో లేచింది. వంట పొయ్యిలో బూడిదంతా ఎత్తి అంట్లు తీసుకుని దొడ్లో బావి దగ్గరికొచ్చింది బావి పక్కనే ఉన్న వేప చెట్టు మీది పక్షులు కింద అలికిడి కాగానే బెదిరిపోయి రెక్కలు టపటప కొట్టుకొంటూ ఎగిరిపోయాయి.

శాంతమ్మ అంట్లు కింద పెట్టి ఒక బాల్చి నీళ్లతోడి బూడిదలోంచి కచ్చిక తీసుకుని పళ్లు తోముకోటం మొదలు పెట్టింది. చుట్టుపక్కల ఇళ్లలో ఎవరూ లేచిన అలికిడి వినిపించటంలేదు. ఆకాశంలో ఎప్పుడో పొడిచిన వేగుచుక్క మిలమిల మెరిసిపోతూ ప్రాణులన్నిటికీ 'మేలుకొలుపు' పాడుతున్నట్లుగా ఉంది. శాంతమ్మ ఒక్కసారి ఇంటికేసి చూసింది. ప్రభాకరంకాని, పిల్లలుకాని, ఇంకా ఎవ్వరూ లేవలేదు. అసలు పెద్దలు ఎవరున్నారు? అంతా పిల్లలే! తనొక్కతే పెద్ద దిక్కుగా మిగిలింది! ఆ ఊహతో శాంతమ్మకు భర్త జనార్దనం గుర్తుకు వచ్చేడు. కష్టసుఖాల పరిమితులు ఎరగని పిల్లలు, అమాయకులు. వాళ్ల ముద్దు ముచ్చటలు చూడకుండా కష్టపడి పాదుచేసి... నీళ్లుపోసి పెంచుకున్న సంసార వృక్షం మొగ్గ తొడిగి పూవుపూసే తరుణానికి హఠాత్తుగా కళ్లు మూయవల్సి వచ్చిన భర్త దురదృష్టానికి లోలోన కుమిలి పోయింది శాంతమ్మ. రోజూ ఈవేళకే తనూ లేచి సందడిగా తిరుగుతూ బావిదగ్గర ముఖం కడుక్కుంటూ తనతో కొంచెంసేపు సంసారంలో ఉన్న కష్ట సుఖం గురించి మాటాడేవారు. పిల్లల్ని లేపి పుస్తకాలు చేతికి ఇచ్చి చదువుకి కూచోపెట్టేవారు. అలాంటి .. భర్త తనని చివరిసారిగా చూసి పలకరించ

కుండా ఒక్కమాటైనా మాట్లాడకుండా వెళ్లిపోతాడనుకుందా

గత స్మృతులతో శాంతమ్మకి దుఃఖం పెల్లుబికి వచ్చింది కళ్ళవెంట జారిన నీళ్లు చీర కొంగుతో తుడిచేసుకుని చెంబుతో నీళ్ళు ముంచుకుని ముఖం కడుక్కోబోతూండగా పెద్ద కూతురు శారద అక్కడికి వచ్చింది– 'ఇక్కడున్నావా అమ్మా!' అంటూ! శారదకు ముఖం కనబడనీకుండా దబదబా ముఖం కడిగేసుకుని మామూలు మనిషైంది శాంతమ్మ.

'శారదా! నేను పొయ్యి అలికివస్తాను. నువ్వు ముఖం కడుక్కుని ఆ కాఫీ గిన్నెలు తోమి పట్టామ్మా!' అని శారదతో చెప్పి తాను ఇంట్లోకి నడిచింది!

అప్పటికి పిల్లలంతా ఒకరొకరే నిద్రలేచి గుండ్రంగా కూచుని పుస్తకాలు ముందేసుకుని చదువుకుంటున్నారు పెంకుటి వసారాలో.

ప్రభాకరం అప్పటికింకా నిద్ర లేవలేదు.

ఒక్క అరగంట గడిచేక నీరజ, శ్యామల చదువునుంచి లేచారు నీరజ పక్కలన్నీ ఎత్తి చిమ్మటానికి చీపురు తీసుకునేలోపల శ్యామల ముఖం కడుక్కునివచ్చి – 'అక్కా! నే కసవు ఊడుస్తాకాని నువ్వెళ్లి ముఖం కడుక్కో' అంది

నీరజ బావిదగ్గరికి నడిచింది!

శారద కాఫీ గిన్నెలు తోలిచి వంటింట్లో పెట్టి వచ్చి – 'ఇక చదువు చాలే వే! అవతలు బోల్డు పనుంటే ఇంకా అలా కూచుంటే ఎలా!' అంటూ పద్మని చదువు నుంచి లేపింది.

నీరజ ముఖం కడుక్కుని వచ్చి శారదతో– 'అక్కా! నాకొంచెం బద్ధకంగా ఉందే! ఇవాళ పద్మని కొంచెం కళ్ళాపు చల్లమని చెప్పవే!' అంది గోముగా

'ఏంతల్లీ అంత బద్ధకం, ఐతే ఇవాళ పి టి క్లాసుకి వెళ్లవా ఏం?' అనడిగింది శారద!

'ఏం ఎన్ సి సి అక్కాయ్! ప్రతి రెండు రోజులకొకసారి వెళ్లలేక నా దుంప తెగిపోతోంది' అంది నీరజ కిందపడిఉన్న ఏదో పుస్తకంతీసి పక్కనేడున్న టేబుల్ మీద పెట్టేస్తూ!

'ఆ పవ్వులేం ఉడకవ్! వెళ్లలేనిదానవు పేరు ఎందుకిచ్చావ్!' ఇవ్వాల్టికి పద్దుకళ్లాపు చల్లుతుంది. నువ్వుమాత్రం పి. టి క్లాసుకి వెళ్లకుండా మానకు' అంది మందలింపుగా శారద.

'ఆఁ నేనిప్పుడు వెళ్లనన్నానా ఏఁవిటీ' అంటూ నీరజ మెట్లుదిగి బావిదగ్గరికివెళ్లి అక్కడున్న పద్మతో — 'చెల్లీ పద్మా! ఇవ్వాల్టికి నా డ్యూటీ నువు కొంచెం చెయ్యమ్మా మా బంగారుకాదూ!' అంటూ పద్మని బ్రతిమాలింది చుబుకం పట్టుకుని.

'సర్లేవే' అంటూ పద్మ బాల్చీలోకి నీళ్లు తోడుకోటం మొదలెట్టింది.

రాజా, వేణు ఇంకా పోటీగా చదువుతూనే ఉన్నారు. శారద వాళ్ల దగ్గరసా వెళ్లి—'చిన్ని తమ్ములూ! లెండి ఇక చాలు చదువు' అంది ఆప్యాయత ఉట్టిపడే స్వరంతో! అప్పటికే ఇల్లంతా చిమ్మి శుభ్రంచేసి వచ్చిన శ్యామల తమ్ముళ్లు లేస్తే అక్కడ కూడ చిమ్మేసి పోదామని వసారాలోకి వచ్చింది చీపురు పట్టుకుని.

'మేం లేవం' అన్నాడు రాజా!

'ఎందుకేవిఁటీ' అంది శారద నవ్వుతూ!

'మమ్మల్ని చిన్నితమ్ముళ్లూ అని ఎందు కన్నావ్' అన్నాడు వేణు మూతి అదోలాపెట్టి.

'మరేమనాలి, కోతుల్లారా లేవండోయ్ అనాలా' అంది చీపురు చేతులో పట్టుకుని నుంచునున్న శ్యామల.

'నీతో ఇప్పుడేం మాట్లాడలా' అన్నాడు వేణు శ్యామలని వెక్కిరిస్తూ.

'కాదక్కాయ్! బావ వాళ్లకీమధ్య 'చిన్నారి సిపాయిలు' అని పేరెట్టాడు. అప్పట్నుంచీ వాళ్లని అలా పిలుస్తేనేకాని పలకటంలా' అంది. అక్కడే ముగ్గులు పెడు తోన్న నీరజ తలెత్తి!

శారద ఒక్కసారిగా కిలకిలా నవ్వి — 'ఓహో అదా అసలు విషయం. అయితే అలాగే పిలుద్దాం.' అని 'చిన్నారి సిపాయిలూ లెండి' అంది.

రాజా వేణూ దిగ్గున లేచారు. గబగబా పుస్తకాలు సంచుల్లో సద్దుకుని టేబుల్ మీద పెట్టేసి బావిదగ్గరికి దౌడు తీస్తుం డగా నీరజ ముగ్గుచిప్ప కింద ఉంచి లేచి నిలబడి — 'చిన్నారి సిపాయిలూ' అని కేక వేసింది.

రాజా వేణూ ఆగి వెనక్కి తిరిగి చూసేరు.

'లాగూలుజారిపోతున్నాయి. పైకిలాక్కోండ్రా [సిపాయిలు అలాగేనా ఉండేది' | అంది పగలబడి నవ్వేస్తూ నీరజ!

మొలకిందికి జారిపోతున్న లాగులు ఒక్కసారిగా పైకి లాక్కుని మళ్లీ పరిగెత్తారిద్దరూ!

శారద, నీరజ, శ్యామల వెనకనుంచి పగ బడి నవ్వటం వాళ్లకి వినిపించలేదు

* * *

నీరజ స్నానాలగదిలో ఉన్న తొట్టిలో నీళ్లు తోడి,వెంటనే స్నానంకూడ ముగించి ఇంట్లో వచ్చి అద్దం ముందు కూచుని తల దువ్వు కుంటూంది. పద్మ అక్కడికివచ్చి- 'అక్కా నా జడ కొంచెం వెయ్యవే నీది అయిపోగానే అంది జడ విప్పేసుకుంటూ.

శ్యామల స్నానాల గదివేపు నడిచింది.

రాజా, వేణు కాలకృత్యాలు ముగించుకు వంటింట్లో బొగ్గుల కుంపటి మీద కా గిన్నె పెట్టి విసనకర్రతో విసురుతూ కూచున్న శారదకు ఎదురుగావచ్చి కూచున్నారు.

'తొరగా కానీ అక్కాయ్ కాఫీ. నాక ఆకలవుతోంది.'. అన్నాడు రాజా రెండ



## కాలం వేసిన గాలం — డాక్టర్ దాశరథి

నీ కాళ్ళతో
నా కళ్ళు తొక్కేస్తూ వెళ్ళకు
నీ క్రౌర్యంతో
నా శౌర్యాన్ని రెచ్చగొట్టకు
చూసి నడు
చూసి నడు

ఎత్తైన కీర్తిశిఖరం యెక్కబోయి
చిత్తుగా పడి పళ్ళూడ గొట్టుకోకు
నమ్రతతో పయనించు
నలువైపులా గమనించు
చూసి నడు
చూసి నడు

ముళ్ళు విత్తి మల్లెలు వెతక్కు
అమృతం అనుకుని రుధిరం గతక్కు
అశాశ్వతమైన ధనరాశిని
శాశ్వతమని భ్రమపడి చితక్కు
చూసినడు
చూసినడు

కాలం వేసిన గాలం
కోరుతోంది నీ గళం
అతి తెలివి తేటల తొందరలో
అజ్ఞాత అంటుతోంది నసాళం
చూసి నడు
చూసి నడు ***

చేతులూ ఒళ్లో పెట్టుకుని కుదురుగా కూచుని.

'ఆకలవుతే అన్నం తిను. కాఫీ ఎందుకు?' అంది అక్కడే మరో ప్రక్క కూచుని కత్తిపీటతో అరటికాయలు తరుగుతూ శాంతమ్మ.

కాఫీ తాగవద్దన్నానని రాజు అలిగి కూచున్నాడు. వేణు— 'నాకు తలనొప్పిగా ఉందే. నాకూ కాఫీ ఇవ్వరా ఏవిటే?' అన్నాడు.

'ఏడ్చేవులేవోయ్! తెలివితేటలు మరీ ఎక్కువవుతున్నాయి. ఆకలిగా వుంటే వాణ్ణి అన్నం తినమన్నామని వీడు కాఫీ కోసం తలనొప్పి అని వంక బెడుతున్నాడు చూశావా అమ్మాయ్!' అంది శాంతమ్మ. దాంతో వేణు కూడా అలిగి కూచున్నాడు

'పోన్లే అమ్మా! ఇవాల్టికి తాగనిద్దూ!' అంది శారద.

శాంతమ్మ శారదవేపు ఒక చూపు చూసింది. మళ్లా వెంటనే తల వంచుకుని కూర తరగటంలో మునిగిపోయింది. ఆ చూపులో ఉన్న భావం గ్రహించటానికి ఎంతో సేపు పట్టలేదు శారదకు.

శారద వెంటనే తమ్ముళ్లను చేరదీసి— 'అమ్మ చెప్పింది వినాలి అటు కాఫీ ఇటు చద్దన్నం కావాలంటే ఎలా. కాఫీ తాగి చద్దన్నం తింటే జబ్బు చేస్తుంది' అంటూంటే ఆ బుజ్జగింపుకి ఉబ్బిపోయి రాజు— 'నే చద్దన్నమే తింటాలే అక్కా!' అన్నాడు

'నేను కూడా అక్కాయ్!' అంటూ

## మిణుగురులు

రాజుతో పోటీ పడ్డాడు వేణు

'ఇవాళ ఒక్కరోజే కాదు మీ రిద్దరూ ఇకనుంచీ పొద్దుటి పూట కాఫీ మానేసి చద్దన్నం తినాలి' అంది శారద

అలాగే నన్నట్లు తలలు ఊపేరు ఇద్దరూ.

అప్పటివరకూ మౌనంగా కూర తరుగుతోన్న శాంతమ్మ అనుకోనట్టుగా లేచి దొడ్లోకి వెళ్లి చీర చెంగుతో కళ్లు వొత్తుకుంటూ నిలబడింది

ఇంతలో — 'మేంకూడ కాఫీ మానెయ్యాలేవిటి?' అన్న ప్రభాకరం గొంతు విని పమిటచెంగు బుజాలమీంచి ముందుకు లాగి సర్దుకుని, కూచుని ఉన్నదల్లా లేచి నిలబడి నేలచూపులు చూస్తూ నిలబడింది శారద

ఎందుకో తెలీకుండానే ఆమె గుండె దడ దడ లాడింది సంతోషంతో! పెళ్లయినప్పటి నుంచీ భర్త తనతో మాట్లాడిన సందర్భాలు చాలా తక్కువ. ఏదైనా కావాలన్నా ప్రభాకరం మరదళ్లతోనో మరదులతోనో తెప్పించుకునేవాడు. ఏమైనా చెప్పాలనిఉన్నా వాళ్లద్వారానే కబురంపించేవాడు శారద కూడ ప్రభాకరాన్ని తనకు తానై ఎప్పుడూ పలకరించలేదు. సినిమాలకుగాని షికార్లకుగాని అతనితో ఒంటరిగా కలిసివెళ్లలేదు. కుటుంబ పరిస్థితులనే అజ్ఞాతశక్తి ఏదో వాళ్లకి అడ్డు తగులుతోందని గ్రహించింది శారద. ఆ అజ్ఞాత

శక్తికి సంతోషంతోనే తల వంచింది. కన్నుల పండువగా భర్త తన కళ్ల ఎదుట తిరుగుతున్నదే చాలని తృప్తిపడింది తను తిరిగే పరిసరాల్లో ప్రభాకరం ఉన్నాడని తెలిసినంత మాత్రంచేతనే శారద హృదయం సంతోషంతో గంతులేస్తూ ఉంటుంది.

ఆరోజు భర్త ఆమెతో పరోక్షంగా మాట్లాడుతూ అంత దగ్గరగా రావటం ఒక వరంగా భావించింది. సంతోషంతో ఉక్కిరిబిక్కిరైంది! ఏం మాట్లాడాలో తెలీలేదు అవతల దొడ్లో నించునున్న శాంతమ్మ కూడ అల్లుడి ప్రవర్తనకి ఆశ్చర్యపోతూ దొడ్డిగుమ్మం పక్కనే గోడవారగా నిలబడి పోయింది. అతని ప్రవర్తన వాంఛనీయం కాదని కాదు ఆవిడ అభిప్రాయం రెండేళ్ల క్రితం పసుపు గుడ్డలు విప్పిన తర్వాత అల్లుణ్నీ కూతుర్నీ ఆవిడ పక్క పక్కన చూసి ఎరుగదు. ప్రభాకరం ఇట్లో పిలవాడుగా పెరిగేకు అందరితోనూ అతనికి చనువు ఎక్కువ! పెళ్లి కాకముందు శారద ప్రభాకరం ఎంతగా నవ్వుతూ పేల్తూ మాట్లాడుకునే వాళ్లో పెళ్ళయాక అంతగా మాటలు తగ్గించేసుకున్నారు. ఆ పవిత్రబంధం వాళ్ళ స్నేహానికి అంతరాయం కల్పించిందేమోనన్న అభిప్రాయం ఆమెకు ఉండేది. అయినా ఎంచేతనోకాని అటు తన భర్త జనార్దనరావుని తాను కాని,వాళ్లను గురించి ఆలోచించేవాళ్ళు కారు వాళ్ళూ అలాగే ఉండిపోయారు. పెద్దవాళ్ళకు లేని తలనొప్పి మనకెందుకులే అన్నట్టు.

ఆ రోజు ప్రభాకరం ప్రవర్తనకు శాంతమ్మ కొంచెం ఆశ్చర్యపడినా అందులో తప్పేమీ ఆమెకు కన్పించలేదు పైగా ప్రభాకరంలో ఏదో మార్పు వస్తున్నందుకు ఆవిడ లోలోన సంతోషించింది. కాని ఆవిడకి కూడ అల్లుడి ఎదుట నిలబడి ఆ సమయంలో ఏం మాట్లాడాలో తెలీలేదు. అయినా మాట్లాడాల్సిన బాధ్యత రాజు తీసుకున్నాడు.

'పెద్దవాళ్లకి మాత్రమే కాఫీ మేం చద్దన్నం తినేస్తాం' అని. రాజు మాటలకి ప్రభాకరం నవ్వి — 'అయితే కాఫీ రూమ్‌లోకి పట్రావోయ్ చిన్న సిపాయ్!' అంటూ తన గదికి నడిచేడు.

శాంతమ్మ ఎంతో ఉబలాటంతో శారదను చూద్దామని మెల్లిగా ఇంటోకి అడుగు పెట్టింది. కాని శారద అక్కడలేదు! ఆమెకు

# స్టేన్స్‌టైర్

# సమస్యలను పరిష్కరిస్తుంది



స్టేన్స్ టైర్ రీట్రెడ్‌లు సురక్షితమైనవి. ప్రఖ్యాతి గాంచిన టైర్‌సోల్స్ సాంకేతిక పరిజ్ఞానాన్ని స్టేన్స్‌టైర్ వినియోగించు కుంటుంది. మీ టైరు ఎక్కువకాలం పనిచేసేటట్టు గ్యారంటీ ఇస్తుంది.

స్టేన్స్ టైర్ ఎక్కువ ఆదాచేస్తుంది ప్రతి కేసింగ్‌కు ఎక్కువ రీట్రెడ్‌లు చేయవచ్చు—కాగా లాభకరమైన అంశం ప్రతి కిలో మీటరును లెఖ్ఖకడితే ఖర్చు అతితక్కువ కాగలదు ముఖ్యమైన కేంద్రాలలో వున్న స్టేన్స్ టైర్ ఫ్యాక్టరీలు వెంటనే సేవచేయడంలో గణతి కెక్కినవి

**STANESTYRE**

**స్టేన్స్‌టైర్**

**అండ్ రబ్బర్ ప్రాడక్ట్స్ లిమిటెడ్**
**తిరుచీ రోడ్, కోయంబత్తూరు**

**ఫ్యాక్టరీలుగల ఇతర కేంద్రాలు:** మద్రాసు, వెల్లూరు. తిరుచి. సేలం. మధురై. ట్యుటికోరన్. బెంగుళూరు. మెంగుళూరు. విజయవాడ. సికింద్రాబాద్. ఎర్నాకుళం. కొట్టాయం. కాలికట్. తిరుచూరు.

## ఇల్లాలి సణుగుడు

కరేపాకు దగ్గర్నించి కంచి పట్టు చీరలదాకా ఇళ్ళదగ్గరికి అమ్మకానికివస్తూంటాయి వీధుల్లో ఫుట్‌పాత్ మీదే అన్ని రకాల వస్తువులూ అమ్ముతున్న ఈ రోజుల్లో ఇంటింటికీ తిరగుతూ వస్తువులమ్మేవారి నిజాయితీని ఎవర్నైనా శంకించలేరు. అమ్మేవాడి వూరూ పేరూ వివరాలూ మనం అడగం వాళ్ళు చెప్పరు అడిగినా నిజమేచెప్తారన్న నమ్మకంలేదు

ఇలా ఇంటింటికీ తిరిగి అమ్మే వాటిల్లో పాత వస్తువులు, కొత్త వస్తువుల-కూడా ఉంటాయి పాతవాటినే మెరుగుపెట్టి కొత్తవాటిగా చలామణి చేయించవచ్చు కూడా అది అమ్మేవాడిని బట్టి ఉంటుంది 'కొనేవారి అమాయకత్వం అందుకు తోడవుతుంది

ఇళ్ళ దగ్గరి కొచ్చిన అమ్మేవాళ్ళని పిలిచి చౌగ్గా వస్తువులని బేరంచేసి కొనుక్కుందామని అందరికీ ఉంటుంది బజారు రేటుకంటే చౌగ్గా కొన్నామన్నతృప్తికోసం ఇల్లాళ్ళిలా బేరం చెయ్యడం సాధారణంగా జరుగుతూ ఉంటుంది

ఇలా ఇంటింటికీ తిరుగుతూ వీధుల్లో అమ్మే వాళ్ళు ఎన్నో రకాలవాళ్ళు ఉంటారు ఏవి కొనాలో ఏవి కొనకూడదో తెలుసుకోడం ఎంతైనా అవసరం. చౌకగా వస్తోందని కొంటే చివరికి అది ఎందుకూ పనికి రాకుండా పోవచ్చు నాణ్యత, మన్నిక సంగతటుంచి అమ్మినవాడి నిజాయితీ మీద మనం ఏమాత్రం ఆధారపడలేము ఎంతో కాలంగా అలా వీధుల్లో తిరుగుతూ అమ్ముకొనే వాళ్ళని తప్పించి కొత్తగా కన్పించే వాళ్ళ దగ్గర ఏవిపడితే అవి కొనడం ఒక్కొక్కప్పుడు అసలుకే మోసం తెస్తుంది

అలా అమ్మకాని కొచ్చిన వస్తువుల నాణ్యత, మన్నిక సంగతటుంచి అదసలు ఆ అమ్మేవాడికి చెందిందా లేక ఎక్కడైనా తస్కరించినదా అన్న అనుమానం ఎందరికొస్తుంది ?

అమాయకురాళ్ళైన గృహిణులు ఎందరో ఇలాంటి విషయాల్లో మోసపోతూ ఉంటారు. అలా చౌకగా వచ్చిందని కొనుక్కున్న వస్తువు దొంగిలించి తెచ్చి అమ్మినదైతే కొనుకొన్న నాలుగోనాడే ఆ అమ్మినవాణ్ని తీసుకుని పోలీసులు కొన్నవాళ్ల తలుపుతట్టే ప్రమాదముంది డబ్బుకి డబ్బూ, వస్తువుకి వస్తువూ, పరువుకి పరువూ పోయే పరిస్థితి ఏర్పడుతుంది దొంగతనం చేసిన వాడితోపాటు దాన్ని కొన్నందుకు వీరు కూడా కోర్టుదాకా పోవాల్సి వస్తుంది. వెరసి తడిసిమోపెడవుతుంది !

[సులోచన]

## మిణుగురులు

బదులుగా శ్యామల వెచ్చి కాఫీ కలపటం కనిపించింది.

'అక్క ఎటుపోయిందో. ఇంతవరదాకా ఇక్కడే ఉందిగా' అంది శాంతమ్మ శ్యామలతో

'దానికి చేతులు నొప్పులుగున్నాయటమ్మా కాఫీ నన్ను కలపమని లోపలికెళ్లి పక్కమీద పడుకుంది' అంది శ్యామల

ప్రభాకరానికి కాఫీ పట్టుకుపోయిన రాజు కొంత సేపటికి తిరిగి వచ్చేడు చేతులో ఏదో కాగితంలో

'ఏమిట్రా అది' అంది శ్యామల

'బావ ఇచ్చాడు అక్కకి చూపెట్టమన్నాడు' అంటూ ఆ చీటీ తీసికెళ్లి లోపల గదిలో ఉన్న శారదకి ఇచ్చేడు

శారద చదువుకుని లోపలనుంచి వచ్చి తల్లి, శాంతమ్మకి చూపెట్టబోతూండగా శ్యామల దాన్నందుకుని బిగ్గరగా అందరికీ వినబడేటట్లు చదివేసింది

'నేనుకూడ రేపటినుంచీ పొద్దున్నే కాఫీ తాగను, పదింటికల్లా భోంచేస్తాను ఇట్లు, ప్రభాకరం !' అని.

శారద, శాంతమ్మ ఒకరినొకరు అదోలా చూచుకుంటూ నిలబడిపోయారు ! కాని వాళ్ళ ముఖాల్లో అప్పటివరకూ లేని ఆనందం తొంగి చూచింది.

తర్వాత పిల్లలంతా భోజనాలు ముగించుకుని, పుస్తకాలు తీసుకుని స్కూలుకి బయల్దేరారు.

ప్రభాకరం కూడ స్నానంచేసి బట్టలు మార్చుకుని బజారుకేసి బయల్దేరాడు

శాంతమ్మ పిల్లల బట్టలు ఉతకటానికి బావిదగ్గరికి నడిచింది. శారద ప్రభాకరం గది శుభ్రం చెయ్యటానికి కదిలింది

(46వ పేజీ చూడండి)

తప్పక చూడండి!

బాలకృష్ణ నటించిన రామకృష్ణ సినీ స్టూడియోస్ వారి

# వేములవాడ భీమకవి

కథ-స్క్రీన్‌ప్లే: యన్.టి. రామారావు బి.ఏ., దర్శకత్వం: యోగానంద్



# కొత్తది!

# అమృతాంజన్ లిమిటెడ్‌వారి విశిష్ఠమైన

# ఆముదము

## శుద్ధిచేసినది.
## వాసనలేనిది.




అమృతాంజన్ ఆముదము సాధారణంగా ఇండలో వాడుకొనే మందులను తయారుచేసే సుప్రసిద్ధ అమృతాంజన్ కంపెనీ వారి మరో విశిష్ఠమైన ఉత్పత్తి.

**అమృతాంజన్ ఆముదము ఆరోగ్యవంతమైన కుటుంబాలకు.**



మూడు సైజులలో లభిస్తుంది:
50 మిలి
100 మిలి
200 మిలి

OBM 3270 TG




***హౌరా మెయిల్ ఏలూరు స్టేషను దాటింది ఒక గంటలో విజయవాడ చేరుతుంది - అనేసరికి సంధ్య గుండెలు వేగంగా స్పందించసాగాయి లోలోపల భయం భయంగా వుంది ఆ మాటకువస్తే దసరా సెలవులకు విజయవాడ ప్రయాణం పెట్టుకున్నప్పటి నుంచే అదొకరకం భయం ఆరంభమయిందని చెప్పాలి***

మధ్యాహ్నం వాల్తేరులో మెయిల్ ఎక్కినప్పటి నుంచీ ఆ భయం ద్విగుణీకృతమయింది పక్కనే కూర్చున్న భాస్కర్ అది పసికట్టాడో ఏమో ఎన్నో కథలు చెప్పుతూ వచ్చాడు, మరెన్నో కబుర్లాడాడు ఆ కథలలో, కబుర్లలో కొంతవరకు సంధ్య భయం పోగొట్టుకున్నది కాని రాజమండ్రిలో భాస్కర్ దిగిపోతూ కర్తవ్యం గుర్తుచేసేసరికి తిరిగి ఆరంభమయింది భయం

"వెంటనే ఉత్తరం వ్రాస్తావుకదా! సంధ్యా!"

అలా గుర్తుచేసిన మరుక్షణంలో ఆమె గుండెలు గుబగుబలాడినయ్ మనసు క్షణాలమీద దిగులు గూడు కట్టింది

ప్లాట్‌ఫారం మీద కంపార్ట్‌మెంటు పక్కగా నిలబడి భాస్కర్ చెప్పేది వినే స్థితిలోనే లేకపోతే సమాధానం ఏం చెప్తుంది ?

"ఏం సంధ్యా! మాట్లాడవేం ?"

ఏం మాట్లాడుతుంది, ఈ ప్రయాణ లక్ష్యం తలచుకుంటేనే భయం కల్గుతుంటే!

"ఏమో! భాస్కర్! భయంగా వుంది"

"ఓ! మై డియర్! ఆ భయమే వద్దంటున్నాను ధైర్యంగా వుండమంటున్నాను" సంధ్య చేయి సన్నగా నొక్కి ధైర్యం ఇంజెక్ట్ చేయటానికి ప్రయత్నం చేశాడు భాస్కర్

"పోనీ! నీతోపాటు నన్ను విజయవాడ రమ్మంటావా ?"

గార్డు విజిల్ ఊది, పచ్చజెండా వూపుతున్నాడు

మై గాడ్! ఒంటరిగానే ఎదుర్కోలేని స్థితిలో వున్న తను భాస్కర్‌తో జంటగా ఇంట్లో అడుగు పెట్టగలదా ?

"ఉత్తరం రాస్తాలే! భాస్కర్! నీవు ఉండు ట్రయిన్ కదులుతున్నది"

కనుచూపు మరుగయేవరకు భాస్కర్ చేయి వూపుతూనేవున్నాడు ఉన్న కాస్త ధైర్యమూ భాస్కర్‌తోపాటు రాజమండ్రిలోనే దిగిపోయింది - అస్తమించిన భాస్కరునితో వెలుగు అంతర్హితమయే విధంగా

ఖాళీ అయిన చోటులో యిద్దరు ఆడపిల్లలు, ఒక మగమనిషి వచ్చి కూర్చున్నారు ఆ ఆడపిల్లలు స్కూల్ విషయాలు మాట్లాడుకుంటున్నారు మగమనిషి తనతో తెచ్చుకున్న మాగజైన్ చదువుకుంటున్నాడు ఎదురుబెంచీ మీద కూర్చున్న కుటుంబం తమిళంలో మాట్లాడుకుంటున్నారు వారిలోకం వారిదే!

సంధ్య వెలుపలికి చూస్తూ కూర్చున్నది సూర్యుడు పడమటకు వాలిపోతున్నాడు మెయిల్ వేగంగా ముందుకు పరుగులు తీస్తున్నది. ఆత్యయిక పరిస్థితి ప్రకటించిన తర్వాత రైళ్ళు లేటుగా నడవకూడదనుకున్నాయేమో! టెలిగ్రాఫ్ స్తంభాలు అంతకంటె వేగంగా వెనక్కిపోతున్నట్లుగా కన్పిస్తున్నాయ్! ఐన్‌స్టీన్ ప్రవచించిన సాపేక్ష సిద్ధాంతం వాటిని వెనక్కి నెట్టుతున్నదా ?!

సంధ్య ఆలోచనలు గతంలోకి యింకా వేగంగా పరుగులు తీస్తున్నాయి

* * *

బి ఏ ప్యాసుకావటంతో అమ్మ తనని చదువు ఆపమన్నది మంచి సంబంధం చూసి వివాహం చేయటం తమ బాధ్యత అని నాన్నగారితో అనేది కాని నాన్నగారు తటస్థంగా వున్నారు తన ఇష్టం అన్నారు ఎం ఏ చదువుకోవాలని వుంటే చదువుకొమ్మన్నారు ఆ తర్వాతే పెళ్ళి చేయవచ్చు అని అభిప్రాయపడ్డారు తన అభిరుచులపట్ల నాన్నగారి అభిమానానికి తనకెంతో ఆనందం కల్గింది తన యందు నాన్నగారికి గల ఆపేక్షకు కరిగిపోయింది ఎం ఏ చదువుకోవాలన్న తన కోర్కెను వెల్లడించింది

అమ్మ ఇంకేమీ మాట్లాడలేదు నాన్నగారి మాటను కాదనలేదు అయితే అమ్మకు సొంత అభిప్రాయం లేకపోలేదు ఆ మర్నాడు మాటల మధ్యలో ఆమె మనసులోని మాటను చెప్పింది

రామారావు బావకు తనను యిచ్చి పెండ్లి చేయాలని ఆమె ఉద్దేశం నాన్నగారికీ, అత్తయ్యకూ మాటా మాటా వచ్చిందిట ఫలితంగా అయిదారేళ్ళ నుంచి రాకపోకలు లేవు ఈ విధంగా సంబంధం కలిస్తే మళ్ళీ రాకపోకలుంటాయి అని, బంధుత్వాలు తెగకుండా వుంటాయి అని అమ్మ అభిప్రాయం

ఇంతకుముందు నాన్నగారుగాని, అమ్మగాని తనముందు తన వివాహ ప్రసక్తి ఎన్నడూ తీసుకురాలేదు పిల్లలముందు ఫలానా సంబంధం అనుకోవటం వారికి నచ్చని విషయం అందునా అయిన సంబంధాల గురించి అలా మాట్లాడుకోవటం వారికి యిష్టముండదు 'ఇది నా కోడలు', 'వాడు నా అల్లుడు' – అని పెద్దలు పిల్లలముందు చెప్పుకోవటం, తీరా పెద్దయ్యాక అవి కాకపోతే బాధపడటం మంచి సంప్రదాయం కాదని వారి అభిప్రాయం

ఇప్పుడు తనకు పై చదువులు చెప్పించాలా, పెళ్ళి చేయాలా అనేది నిర్ణయించుకోవాలసిన సమయం అన్న ఉద్దేశంతో అమ్మ తన మనసులోని మాటను బయటపెట్టింది నాన్నగారు మాత్రం ఇంకా గుంభనంగానే వున్నారు

తను రామారావు బావను ఆ దృష్టితో ఎన్నడూ చూడలేదు ఆ మాటకువస్తే తనకు పెళ్ళిమీదకంటే చదువుమీదే మనసు వుంది తన మాటే చెల్లింది చివరకు

ఎక్కడ చదవాలి అన్న ప్రసక్తి వచ్చేసరికి అమ్మ గుంటూరు పి జి సెంటర్ అయితే బాగుంటుందేమో అన్నది కాని నాన్నగారు వాల్తేరు అన్నారు గుంటూరు అయితే విజయవాడకు దగ్గర అనీ, తను అసలే పిరికికాబట్టి తాము అప్పుడప్పుడు వెళ్ళి చూసిరావచ్చు అని, లేదా శని ఆదివారాలలో

తను యింటికి వచ్చిపోవటానికి అందుబాటుగా ఉంటుంది అన్న అభిప్రాయం ప్రకటించింది అప్పటికీ నాన్నగారు గుంటూరుకు సుముఖంగా లేకపోతే— తను తల్లిదండ్రుల చాటున పెరిగిన పిల్ల అనీ, తను పిరికి అనీ, గుంటూరులో అయితే ఇంటి దగ్గర మేనత్త కనిపెట్టి ఉంటుందనీ, రామారావు కాలేజీ లెక్చరరుగా ఉన్నాడు కాబట్టి చదువులో సహాయంగా ఉంటాడని అమ్మ తన అభిప్రాయానికి బలం చేకూర్చుకోవటానికి ప్రయత్నం చేసింది

ఈ మాట విన్న తర్వాత నాన్నగారు గుంటూరులో చదవటానికి ససేమిరా ఒప్పుకోలేదు వాల్తేరు యూనివర్సిటీలో చదువుతుంది, చక్కని లేడీస్ హాస్టలు ఉంది, అందులో చేరుతుంది, ఎల్లకాలం తల్లిదండ్రుల చాటున పెరగకూడదు పిల్లలు, దూరంగా, ధైర్యంగా ఉండటం అలవాటు కావాలి నలుగురితో కలిసి మెలిసి ఉండటం నేర్చుకోవాలి— అంటూ ఎన్నో చెప్పారు

అమ్మ ఇక కాదనలేదు

నాన్నగారు స్వయంగా వాల్తేరు వచ్చి యూనివర్సిటీలో ఎం ఏ లో చేర్పించి లేడీస్ హాస్టల్లో అట్టిపెట్టి వెళ్లారు

తను చాలా శ్రద్ధగా చదువుకుంటున్నది అక్కడి వాతావరణానికి క్రమక్రమంగా అలవాటు పడుతున్నది పరీక్షలలో మంచి మార్కులు వస్తున్నాయి ప్రతి పరీక్షలో తనది సెకండ్ రాంక్, ఫస్ట్ రాంక్ ఒక బాయ్ స్టూడెంట్‌కి వచ్చేది క్లాస్‌మేట్స్ తమ ఇద్దరినీ ప్రత్యర్థులుగా చూసేవారు

తనకు అసూయ లేదుగాని, ఫస్ట్ రాంక్ తెచ్చుకోవాలన్న పట్టుదల ఉండేది ఇంకా కష్టపడి చదివింది మరొక పరీక్షలో తనకి ఫస్ట్ వస్తే అతగాడికి సెకండ్ వచ్చింది

ఆ రోజు ఇప్పటికీ తన స్మృతి పథంలో మెరుస్తూ ఉంటుంది ఆనాటి సంఘటన తన జీవిత పథానికి ఒక పెద్ద మలుపు!

లైబ్రరీ రిఫరెన్స్ సెక్షన్‌లో తను ఒక్కర్తే కూర్చుని నోట్స్ తయారు చేసుకుంటున్నది

"ఎక్స్‌క్యూజ్ మి! మాడమ్!"

ఎవరా అని వెనక్కి తిరిగి చూస్తే అతగాడే!

"పొద్దుటా మీ ఆన్సర్ పేపర్ ఒక్కసారి ఇస్తారా? చూసి ఇస్తాను" అతని అభ్యర్థనను తను కాదనలేకపోయింది పుస్తకాల మధ్యలో ఉన్న ఆన్సర్ పేపరు తీసి ఇచ్చింది

"ఇక్కడ కూర్చుంటే మీకేమయినా అభ్యంతరమా?" అతని ప్రశ్నలో ధ్వనించిన సంస్కారం తన మనసును ఆకట్టుకుంది అది అందరికీ సంబంధించిన లైబ్రరీ తనకు ఎందుకు అభ్యంతరం!

"కూర్చోండి"

ఎదురుగా వున్న కుర్చీలో కూర్చుని అయిదు నిమిషాలు తను యిచ్చిన ఆన్సర్ పేపరు దీక్షగా చూసి యిచ్చేస్తూ—

"చాలా బాగా వ్రాశారండి! రియల్లీ యు డిజర్వ్ ఫస్ట్ మార్క్! కంగ్రాచ్యులేషన్స్" అన్నాడు

"థాంక్స్"

తను ఏమేమి పుస్తకాలు రిఫర్ చేసింది అడిగి తెల్సుకున్నాడు. తను ఏమేమి చదివేది చెప్పాను

అలా భాస్కరుతో అయిన పరిచయం క్రమక్రమంగా వృద్ధి అయింది

లీజర్ టైమ్‌లో లైబ్రరీలో కూర్చుని పుస్తకాలు రిఫర్‌చేస్తూ కన్పించేవాడు తనకు చదువుపట్ల అతనికి గల శ్రద్ధాసక్తులకు తను పులకించిపోయేది తనూ పట్టుదలగా చదువుతున్నది తనకు ఒకటి రెండు పరీక్షలలో ఫస్ట్ మార్క్ రావటం జరిగింది అటువంటి సమయాలలో అతను ఈర్ష్యచెందక తనను మెచ్చుకునేవాడు ఇంకా బాగా చదవమని ప్రోత్సహించేవాడు అతని మెచ్చుకోలుకు తను కరిగిపోయేది

ఇంకా ఇంకా కష్టపడి చదవసాగింది ఇప్పుడు యిద్దరూ పోటాపోటీగా వున్నారు ఒకరిని మించాలని మరొకరికి పట్టుదల మించినవారిని చూసి మెచ్చుకోలు!

పాఠాలమీద ప్రారంభమయిన ప్రసంగం క్రమక్రమంగా ప్రాపంచిక విషయాల మీదకు మళ్లేది లైబ్రరీలో కలుసుకోవటంతో ఆరంభమయిన పరిచయం రోజు రోజుకూ బాహ్య ప్రపంచంలోకి జరిగేది

భాస్కర్ ఒక్కరోజు కాలేజీకి రాక కన్పించక పోతే ఎంతో ఆరాటపడేది! మరుసటిరోజు కన్పించేసరికి మనసు ఊరట చెందేది తనూ క్రితం రోజల్లా అదే స్థితిలో వున్నమాట అతను వెల్లడించేసరికి మనసు ఊగిపోయేది

**ఫిలిం బ్యాలట్ ముగింపుతేదీ:**
**16-2-'76**

పనిగట్టుకు బీచ్‌కి వచ్చేవాడు భాస్కర్ తను పని కల్పించుకుని వెళ్లేది ఒకరి కళ్లలోకి ఒకరు చూస్తూ ఒకరి మాటలలోని మాధుర్యం మరొకరు ఆస్వాదిస్తూ — రోజులు, నెలలు యిట్టే దొర్లిపోయాయి

ఇది ప్రేమ అని తెలుసుకోవటానికి యింకెన్నో రోజులు పట్టలేదు

దగ్గర వున్నప్పుడు — భాస్కర్ సూదంటు రాయి, తను ఇనుము

దూరంగా వున్నప్పుడు — భాస్కర్ సూర్యుడు, తను గ్రహము

ఈ అయస్కాంత ఆకర్షణ నుంచి తను తప్పుకోలేకపోతున్నది, ఈ గురుత్వాకర్షణ నుంచి తను తప్పుకోలేకపోతున్నది

ఒక ఘడియ ముందు ఉదయించిన పున్నమి చంద్రుడు సముద్రంలో వేయించిన వెండిబాట వెంట అతనూ, తనూ చేయీ చేయీ కలుపుకొని దిగంతానికి నడిచిపోవాలన్న ఆకాంక్ష —

ప్రాగ్దిశలో ఉదయించే సూర్యుడు పశ్చిమాకాశాన విరియించే రంగుల హరివిల్లు అతనూ, తనూ చెరొకపక్కా పట్టుకుని బంగరు భవిష్యత్తులోకి పరుగులు తీయాలన్న తపన —

దసరా సెలవులకు ఇంటికి వచ్చి తల్లిదండ్రుల అనుమతి తీసుకోవాలన్న నిర్ణయం చేశాయి

ప్రయాణం అనుకున్న నాటినుంచీ భయమే! అమ్మ ఏమంటుందో? నాన్నగారు ఒప్పుకుంటారో లేదో? ఈ వెండి బాట చిక్కేనా? ఆ బంగరు భవిష్యత్తు దక్కేనా?!

తను ఊహల్లోనే ఉన్నది

హవురా మెయిల్ విజయవాడ ప్లాట్‌ఫారం మీదికి వచ్చి ఆగింది

* * *

సంధ్య రిక్షా దిగి ఇంట్లోకి వెళ్లేసరికి ఇల్లు నిశ్శబ్దంగా ఉంది రామనాథంగారు ఒక్కరే కూర్చుని భవాన్స్ జర్నల్ చదువుకుంటున్నారు సంధ్య వచ్చింది ఆయన గమనించలేదు సంధ్య పలకరించగా ఆయన ఆశ్చర్యపోయారు

"ఇదేమిటమ్మా! ఇలా వచ్చావ్! సెలవులకు రానంటావిగా?"

"అవును నాన్నగారూ! అలాగే అనుకున్నాను ఫైనల్ ఇయ్యర్ కదా అక్కడే ఉండి చదువుకుందామనుకున్నాను కాని"

"తక్కిన స్నేహితులందరూ ఇళ్ళకు వెళ్తుంటే నీవూ బయల్దేరి వచ్చావ్? అంతేనా?"

"ఆఁ! అదే నాన్నగారూ!" అసలు సంగతి చెప్పే ధైర్యం లేదు సంధ్యకు

'నువ్వు రానని రాశావు కదా! అందుకని మీ అమ్మ మీ మామయ్యగారింటికి వెళ్లింది చూసి, నాలుగు రోజులుండి వస్తానని"

"అయితే అమ్మ ఇంట్లో లేదన్నమాట"

"అమ్మే కాదు తమ్ముడూ లేడు బయాలజీ టూర్‌కి మైసూర్ వెళ్లాడు లోపల వంట మామ్మగారుంది వెళ్ల"

సంధ్య స్నానం చేసి, బట్టలు మార్చుకుని వచ్చేసరికి రామనాథంగారు బావమరదికి ట్రంక్‌కాల్ చేస్తున్నారు సంధ్య వచ్చింది కాబట్టి భార్య అన్నపూర్ణమ్మగారిని పంపించమని చెప్పారు

"అమ్మాయ్! రేపు ఉదయమే మీ అమ్మ బయల్దేరి వస్తుంది"

రామనాథంగారు సంధ్య చదువు గురించి, పరీక్షల గురించి, ఇంటర్నల్ ఎసెస్‌మెంటు గురించి, హాస్టల్ జీవితం గురించి అడుగుతూంటే సంధ్య సమాధానం చెప్తున్నది కాని ఆమె ఆలోచన తండ్రికి భాస్కర్ గురించి ఎలా చెప్పటమా అనే!

భోజనాలయి పడుకున్నా యిదే ఆలోచన సంధ్యకు తెల్లవారి ఉదయం తల్లి వస్తుంది ఆమెకు ఈ ప్రేమలూ — పెళ్లిళ్లూ నచ్చుతాయో లేదో! అదీగాక వాల్తేరు చదువుకు పోబోయే ముందు రామారావు బావకు తనని యిచ్చి పెళ్లి చేస్తే బాగుంటుందన్న తన కోరిక బహిర్గతం చేసిందికూడాను

నాన్నగారి మనసులో రామారావు బావ సంబంధం గురించి ఎటువంటి ఆలోచన వుందో తెలియదు అత్తయ్యతో వచ్చిన మాట పట్టింపు మీదే కూర్చున్నారు అంతమాత్రాన భాస్కర్ సంబంధం ఒప్పుకుంటారా?

సస్పెన్స్ భరించలేకుండా వున్నది సంధ్య తల్లి వచ్చేముందే తండ్రికి చెప్పాలని ఆమె ప్రయత్నం తల్లి బి ఏ తో చదువు ఆపించి, పెళ్లి చేయమంటే — సంధ్య మనసులోని కోరిక గ్రహించి పై చదువులకు పంపించిన తండ్రి — యిప్పుడు

## తల్లి — తండ్రి

ఈ పెళ్లి విషయంలో కూడా సుముఖంగా వుండక పోతారా అన్న ఆశ లేకపోలేదు సంధ్యకు తొలికోడి కూసింది తూర్పున వేగుచుక్క వీనస్, పశ్చిమాన వెన్నముద్ద జుపిటర్—ధైర్యంగా వుండమంటున్నాయి

ఉదయం బ్రేక్‌ఫాస్ట్ సమయంలో సంధ్య గొంతు సవరించుకొంది

"నాన్నగారూ ! క్రితం సంవత్సరంలోలాగానే ఈ సంవత్సరమూ నాకు మంచిమార్కులు వస్తున్నాయి "

"మంచిదమ్మా ! మీ అమ్మ గుంటూరులో చదివించమన్నా — నేను కాదని నిన్ను వాల్తేరు పంపించింది అందుకే శ్రద్ధగా చదువుకొనే నీవంటి ఆడపిల్లలకు అది అనువయిన వాతావరణం "

రామనాధంగారు తన ధోరణిలో తను ఉన్నారు ఆయనని అలా వదిలితే ఎంతసేపయినా తనకు నచ్చే విషయాల గురించి మాట్లాడగలరు కాని సంధ్య—తను మెచ్చినవాని గురించి తండ్రికి నచ్చచెప్పాలన్న—ఉద్దేశం

"అవును నాన్నగారూ ! టవున్ రొదకు దూరంగా వుంటుందిగా యూనివర్శిటీ ! చాలా ప్రశాంతంగా వుంటుంది హాస్టల్ సముద్రానికి దగ్గరగా వున్నా ఆ హోరు నేపధ్య సంగీతంలా హాయిగా వుంటుంది అందుకనే నాకు సెకండ్ రాంక్ — అతనికి ఫస్ట్ రాంక్ " భాస్కర్ ప్రసక్తి తీసుకురావాలని సంధ్య ప్రయత్నం

"అతను — ఎవరు సంధ్యా ! నీకన్నా శ్రద్ధగా చదువుతాడా ?"

"శ్రద్ధేకాదు నాన్నగారూ ! మంచి తెలివయిన వాడు కూడాను "

"ఆహా !"

"మనిషికూడా చాలా మంచివాడు నాన్నగారూ ! అందుకనే అతనంటే నాకు "

రామనాధంగారు సంధ్య ముఖంలోకి పరీక్షగా చూడసాగారు—ఈ మాట్లాడేది తన కూతురేనాఅని

సంధ్య ఆ చూపులకు తట్టుకోలేక ముఖం పక్కకు తిప్పుకుంది

"అతనంటే నీకు ఏమిటమ్మా ?"

ప్రేమ అనబోయి — భయపడి — "ఇష్టం నాన్నగారూ" అన్నది సంధ్య

దసరా సెలవులకు ఇంటికి రాకుండా వాల్తేరులో ఉండి చదువుకుంటానన్న సంధ్య అనుకోకుండా రావటం ఇప్పుడు ఎవరో ఒక అబ్బాయి ప్రసక్తి తీసుకురావటం, అతనంటే తనకు ఇష్టమనటం — రామనాధంగారికి పరిస్థితి అర్ధమవుతున్నది

"ప్రేమించుకున్నారు — అంతేనా ?"

"అవును — నాన్నగారూ — అంతే !"

రామనాధంగారి నొసలు ముడిబడ్డాయి ఆయన అహం దెబ్బతిన్నది కూతురిని చదువుకోమని వాల్తేరు పంపించాడు కాని ప్రేమించుకోవటానికి కాదు

"పెళ్లి కూడా చేసుకున్నారా ?" ఆయన గొంతులో వెటకారం ధ్వనించింది

"చేసుకోలేదు నాన్నగారు — చేసుకుందామనుకున్నాం "

ఆవేశంతో ఊగిపోయారు రామనాధంగారు నిర్ణయాలు, వాగ్దానాలు కూడా అయిపోయాయి తన పెద్దరికాన్ని లెఖ్ఖ చేయలేదు తండ్రిగా తన అస్తిత్వాన్ని ఖాతరు చేయలేదు తల్లిదండ్రుల చాటున, ఆకుల మధ్య పిందెలాగా పెరిగిన పిల్లను చిలక కొట్టిందా పిందె ఫలించదు, నేల రాలిపోతుంది

"అంతా నీ ఇష్టమేనా ? పెద్దవాళ్ళం ఏమయామనుకున్నావ్ ? పై చదువులు చదివేసరికి కళ్ళు నెత్తికొచ్చాయా ?, పొరుగూరు పోయేసరికి పెద్ద అయాననుకున్నావా ?" రామనాధంగారి కళ్ళు చింతనిప్పుల్లా అయాయి

"భాస్కర్ చాలా మంచివాడు నాన్నగారూ ! అతన్ని చూస్తే మీరిలా అనరు "

"నాతో ఇక ఒక్క మాట మాట్లాడటానికి వీలులేదు ఈ పెళ్లి జరగటానికి వీల్లేదు, జరగదు నీవు ఇక వాల్తేరు వెళ్ళేదికూడా లేదు నీ చదువు ఇంతటితో సరి " తన నిర్ణయము తెగేసి చెప్పారు

"అది కాదు — నాన్నగారూ " అగాధంలో పడిపోతున్న మనిషి ఓ చిన్న రాయి పట్టుకొని ఆగటానికి చేసే ప్రయత్నంలా సంధ్య తండ్రికి నచ్చచెప్ప ప్రయత్నం చేసింది



"నా కింకా ఏమీ చెప్పవద్దు" అన్నారు రామనాధంగారు మేఘంలా గర్జించి బయటికి వెళ్లిపోయారు

సంధ్యకు దుఃఖం ఆగింది కాదు, కళ్ళు ఒత్తుకుంటూ లోపలి గదిలోకి వెళ్ళింది తలుపు బిగించుకుని దిండులో తల దూర్చి ఎంతసేపో కుమిలిపోయింది తన భయమే నిజమయింది ! అంతరాంతరాలలోని అనుమానం వృధా పోలేదు

కన్నెపిల్ల కోరుకున్నవాడిని చేసుకోకూడదా ? ఆడపిల్ల జీవిత సహచరుని ఎన్నుకోకూడదా ? ఆడపడుచు తన అభిరుచులకు తగినవాడితో జీవితం పంచుకోకూడదా ? స్త్రీకి ఆ మాత్రం స్వాతంత్ర్యం లేదా ? ఈ అంతర్జాతీయ మహిళా సంవత్సరంలో తనవంటి కన్నెపిల్లలకు జరిగే మేలు ఏమిటి ?

భాస్కర్ ఉత్తరం వ్రాయమన్నాడు ఏం వ్రాస్తుంది ? స్వయంగా చెప్పి అతని సలహా తీసుకుంటే —

గబగబా లేచింది బట్టలు సంచిలో పెట్టుకుంది నాన్నగారు ఆఫీసునుంచి సాయంత్రానికిగాని రారు కాని తల్లి కాసేపటికి రావచ్చు ఆమె వస్తే స్నేహితుల యింటికి వెళ్లినట్లుగా చెప్పమని వంట మామ్మగారితో చెప్పి సంధ్య బయల్దేరింది

స్టేషనుకు వెళ్లి రాజమండ్రికి టికెట్ తీసుకుంది సర్కార్ ఎక్స్‌ప్రెస్ ప్లాట్‌ఫారంమీదకు వస్తున్నట్లుగా లౌడ్‌స్పీకర్‌లో ఎనౌన్స్‌మెంటు విన్పిస్తోంది సంధ్య ప్లాట్‌ఫారంమీదకు వెళ్ళేసరికి ట్రయిన్ వచ్చి ఆగుతున్నది లేడీస్ కంపార్టుమెంటు వెతుక్కుంటూ వెళ్ళింది సంధ్య

పెట్టెలోనుంచి దిగుతూన్నవాళ్లను చూసి నిశ్చేష్టయింది సంధ్య

ట్రయిన్ దిగుతూన్న అన్నపూర్ణమ్మగారిని చూసి అవాక్కయింది సంధ్య

"ఈ ట్రయిన్‌లో వస్తున్నానని ఎలా అనుకున్నావ్ ?" తనని రిసీవ్ చేసుకునేందుకు సంధ్య వచ్చిందనుకున్న అన్నపూర్ణమ్మగారు ఆశ్చర్యపోయింది

సంధ్యకు ఏమి సమాధానం చెప్పాలో అర్ధం కావటంలేదు

"అదేమిటే ! చేతిలో సంచి ! ఊరేమయినా వెళ్తున్నావా ?"

"లేదమ్మా ! బజారునుంచి వస్తున్నాను నా ఫ్రెండ్ వస్తానన్నది దానికోసం స్టేషనుకు వచ్చాను " అతకటానికి సంధ్య ప్రయత్నం

"వచ్చిందా మరి ?"

"అదే చూస్తున్నాను — రాలేదు "

"సరే — పద - వెళ్దాం "

సూట్‌కేస్ పోర్టరు నెత్తిమీద పెట్టి ఇద్దరూ స్టేషను బయటకు నడిచారు

"దసరా సెలవులకు నీవు రానని రాసేస్తే మామయ్యగారింటికి వెళ్లానే — చూసిరావచ్చని "

ఉలుకూ పలుకూలేని సంధ్యను చూస్తే అన్నపూర్ణమ్మగారికి అర్ధంకావటంలేదు

గేటు దగ్గరి టికెట్ కలెక్టరు సంధ్య ఇచ్చిన టికెట్ చూసి "ఇది రాజమండ్రి టికెట్ మాడమ్ ! కౌంటరులో రిటర్న్‌చేస్తే డబ్బు రిఫండ్ చేస్తారు" అని టికెట్ తిరిగి యిచ్చివేశాడు

అన్నపూర్ణమ్మగారికి సంధ్య పద్దతి అయోమయంగా వున్నది

ఆ టికెట్ మళ్లీ అతని చేతిలోనే పెట్టి విసవిసా నడిచి ఎదట వున్న రిక్షా ఎక్కి కూర్చున్నది సంధ్య అన్నపూర్ణమ్మగారు వెనకవచ్చి రిక్షా ఎక్కారు దారిలో మాట్లాడించినా సంధ్య పలకలేదు అన్నపూర్ణమ్మగారు అప్పటికి కొంత గ్రహించుకొన్నారు ఏదో దాచటానికి సంధ్య ప్రయత్నం చేస్తున్నది కాని దాచలేక, ఆ బరువు మోయలేక, బాధపడిపోతున్నది

ఇంట్లోకి వచ్చింతర్వాత - "ఇందాకటి నుంచి చూస్తున్నాను అదోలా ఉన్నావ్ ! అసలేం జరిగిందో చెప్పు సంధ్యా ! కన్నతల్లి దగ్గఅ నీకు దాపరికమేమిటమ్మా !"

అన్నపూర్ణమ్మగారి అనునయ వాక్యాలకు, చల్లని గాలికి వర్షించే నల్లని మేఘాల్లా, సంధ్య కళ్ళు నీటికుండ లయాయి

జరిగిందంతా చెప్పి "అమ్మా ! నాన్నగారు కాదనటమే కాదు, కసిరికొట్టారు నే చెప్పేది విన్పించుకోక విదిలించివేశారు నువ్వయినా నన్ను క్షమిస్తావా — అమ్మా !"

సంధ్య కంఠం గద్గదమయింది తల్లి ఒళ్ళో తల దాచుకుని బావురుమన్నది

సహజంగా పిరికిగుండె అయినా ఆ గుండెలో వయసు విరియించిన ప్రేమ ప్రసూనాల సౌరభం తల్లిదండ్రుల చాటున పెరిగిన పిల్ల అయినా ఆ కన్నె మనసులో మొలకెత్తిన ప్రణయభావం పలికించే గానమాధుర్యం —

కన్నతల్లి మనసు కలత చెందింది

(34వ పేజీ చూడండి)

# మీ తల్లి ఇచ్చిన సలహాను నమ్మండి

మీ పాప ఏడ్చినపుడు,
మీ అమ్మమ్మ చెప్పినట్లుగానే,
**వుడ్‌వార్డ్స్ గ్రైప్ వాటర్**
వాడమని చెప్పుతుంది.




**100** ఏళ్లుగా మాతృలోకం విశ్వసించినది

OPCM-1-75 TEL

'వేములవాడ భీమకవి'లో ఎన్.టి.ఆర్., విజయలలిత



# ప్రభ సినిమాల కథ

ఒకనాడు హరికథల మూలంగా ప్రేక్షకులను పరవశింపచేసిన కోటి సూర్యప్రభ, నవశక్తి గంగాధర రావుగారి ఆశీర్వాదబలంతో "నీడలేని ఆడది" చిత్ర నాయికగా పేరు నార్జించుకున్న విషయం పాఠకులకు తెలుసు.

**అగ్రతాంబూలం !**

మొదటి చిత్రం చూచిన ప్రతి ప్రేక్షకుడు ప్రభలోని ఉత్తమ నటన్ను ఒప్పుకున్నారు. పెద్ద హోప్ పెట్టుకున్నారుకూడా. కానీ, తరువాత వచ్చిన చిత్రాలు ఆమె పెరగడానికి దోహదం చెయ్యలేకపోయాయి.

ఇప్పుడున్న యంగ్‌బాచ్‌లో ప్రభవలె డైలాగులు చెప్పే నటి లేదంటె అతిశయోక్తి కాదు. అందుకనే 'నటసామ్రాట్' ప్రభను ఆశీర్వదించారేమో అనిపిస్తుంది. టైమింగ్, డిక్షన్‌లో ప్రభకు అగ్రతాంబూలం ముట్టచెప్పాలి.

భగవంతుడు గానం, నృత్యం, నటనాకౌశలం ప్రభకు వరంగా యిచ్చాడు. ప్రభది కోయిల గానమని, ప్రభది మయూరి నాట్యమని, ప్రభది ఉన్నత అభినయమని చెప్పక తప్పదు.

**దుష్ప్రచారం !**

ప్రభకు గర్వమని, అహంకారంగా ప్రవర్తిస్తుందని ఒక ప్రచారం వుంది. గిట్టనివాళ్లు చేస్తున్న దుష్ప్రచారం పట్ల ప్రభను కొందరు అపార్థం చేసుకుంటున్నారుకూడా. కానీ, ఆమెతో ఒకసారి పరిచయం అయితే, ప్రభ ఎంత మంచిదో అర్థమవుతుంది.

**వైవిధ్యం వున్న వేషాలు**

మీకు ఎలాంటి పాత్రలంటె యిష్టం అని ప్రభను అడిగాము. ఒక చిత్రంలోని పాత్రకు, మరొక చిత్రంలోని పాత్రకు భిన్నత్వం వున్నప్పుడె 'నటి'కి భవిష్యత్తు ఆశాజనకంగా వుంటుంది, అంది ప్రభ.

**నటిస్తున్న చిత్రాలు**

రవీంద్రా ఆర్ట్ పిక్చర్స్‌వారి 'అమ్మా—నాన్న' అనంతలక్ష్మి కంబైన్స్‌వారి "ఈ కాలపు పిల్లలు"; కరుణ చిత్రవారి "వింత ఇల్లు"; పాంచజన్య ప్రొడక్షన్స్‌వారి "పెద్దన్నయ్య"; జయవాణీ ఆర్ట్సు వారి "అదృష్టవంతురాలు"; ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్ వారి 14వ చిత్రం; ఎన్. బి. ఎస్. ఫిలిమ్స్ మొదటి చిత్రం; ధృవ చిత్రవారి కొత్త చిత్రం; ప్రసన్నలక్ష్మి పిక్చర్స్‌వారి రెండవ చిత్రం; కళ్యాణి సుబ్బారావుగారి మొదటి చిత్రం.



'ప్రేమాయణం'లో ఒక దృశ్యం

## ★ సినిమా విశేషాలు ★

**కలర్ చిత్రాలు**

అంజలీ పిక్చర్ కంబైన్స్‌వారి 'మహాకవి క్షేత్రయ్య', రాజేశ్వరీ చిత్ర వారి 'మహాత్ముడు', ఎన్. పి. ఫిలిమ్స్ వారి 'రాము—సోము', రవి చిత్ర వారి 'నేరం నాది కాదు ఆకలిది', ఎన్.ఎ. మూవీస్ వారి 'కొల్లేటి కాపురం', పి.వి.టి. ప్రొడక్షన్స్‌వారి తమిళ చిత్రం.

హీరో లందరితోనూ నటిస్తున్న ప్రభ 'హి—మాన్'తో యింత వరకు నటించలేదన్న బాధ ప్రేక్షకులకు, ప్రభకు వుండడం సహజమే. ఆమెకు శోభన్‌బాబు గారితో నటించాలన్న ఆశ వుండడంలో తప్పు లేదు. త్వరలో అది నెరవేరే అవకాశం లేకపోలేదు.





వర్థమాన తార

**కృతజ్ఞతలు**

జన్మ నిచ్చిన తల్లిదండ్రులకు, నవశక్తి గంగాధరరావుగారికి, ఆంధ్ర ప్రేక్షక మహాశయులకు ప్రభ తన కృతజ్ఞతలను పత్రికా ముఖంగా తెల్పుకుంటూ, అందరికీ సంక్రాంతి శుభ సంతోషాలను కలుగచేయాలని ఆకాంక్షిస్తుంది.



### దాసరి విజయం!

ప్రజామరంజకంగా చిత్రాలను మాపెట్టగల ప్రజ్ఞ దాసరికి వున్నది నిజం గాబట్టే, ఆయన అందించేవాటికి అమోఘ ఆదరణ లభిస్తుంది

ఇటీవల విడుదలయిన సంచలన చిత్రం "స్వర్గం—నరకం" దాసరి పలుకుబడిని మరింత పెంచింది నటీనటులు ఎవరయినా, కథలో బలం వుండి, చెప్పే విధంగా చెప్పగలిగితే, అట్టి చిత్రానికి కూడా గట్టి స్థానం యివ్వగల సంస్కారం మన ప్రేక్షకులకు వున్నదని నిరూపించారు

### మరి నటించను

'ముత్యాల ముగ్గు" చిత్రానికి రావు గోపాల రావువలె, 'స్వర్గం—నరకం" చిత్రానికి దాసరి వేషం 'పేయింగ్ ఎలిమెంట్" అయిన నిజాన్ని ఎవరయినా కాదనగలరా? మళ్లీ నటించే వుద్దేశ్యం తనకు లేదని, అదే మొదటి వేషం, ఆఖరి వేషం అని గడుసరి వివరించారు

### అంగీకరించిన చిత్రాలు

దర్శకుడుగా ముద్ర వేసిన ప్రతాప్ ఆర్ట్స్ ప్రొడక్షన్స్ అధినేత రాఘవగారి తదుపరి చిత్రానికి తను దర్శకత్వం నిర్వహిస్తున్నట్టు దాసరి చెప్పి, ఆయన వితరణ శీలానికి కృతజ్ఞతలు చెప్పారు

ప్రముఖ చిత్ర నిర్మాత, వాహినీ స్టుడియో అధినేత శ్రీ నాగిరెడ్డిగారు ఎలిచి హిందీ ఒకటి, తెలుగు ఒకటి చెయ్యమని అడిగినప్పుడు, తన ఆనం దానికి అవధులు లేవు అన్నారు దాసరి

స్వర్గీయ చక్రపాణిగారు రాసిన మూడు కథల్లో ఒకదాన్ని చిత్రంగా రూపొందించే బాధ్యతను నారాయణరావు స్వీకరించారు

స్టార్‌డమ్‌పైన, హీరో ప్రాబల్యంపైన తనకు పెద్దగా నమ్మకం లేదని చెప్పి, మంచి చిత్రాలను ఆదరిస్తున్న ప్రజలనే నమ్ముకున్నట్టు దాసరి చెప్పినది అక్షరాలా నిజమే అనిపించింది

శ్రీ లలితా మూవీస్ ప్రసాద్‌కు, బాబ్ అండ్ బాబ్ ప్రొడక్షన్స్‌కు, అరుణా ఆర్ట్స్ పిక్చర్స్‌కు, స్వతంత్ర ఆర్ట్స్ ఎక్చర్స్‌కు దాసరి కాల్‌షీట్లు యిచ్చారు

రాబోయే రామారావుగారి చిత్రం "మనుషు లంతా ఒక్కటే", జయచిత్ర—కృష్ణంరాజ విచిత్రమయిన పాత్రలను పోషించిన "యవ్వనం కాటేసింది" చిత్రం ప్రేక్షకులను ఆకర్షించి, ఆనందపరచగలవన్న నమ్మకాన్ని దాసరి వ్యక్తపరచారు

### ఇలా జరిగితే?

ప్రతాప్ ఆర్ట్స్ ప్రొడక్షన్స్ తలపెట్టిన నాంగవ చిత్రం పేరు యిది ఈ చిత్రానికి దర్శకత్వాన్ని దాసరి నిర్వహించ, సంభాషణలను, సినిమా అనువాదాన్ని గడుసరి సమకూరుస్తున్నారు

చిత్రంలోని ముఖ్య స్త్రీ పాత్రలను శ్రీవిద్య, శ్రీదేవి పోషించగలరని నిర్మాత రాఘవ చెప్పారు

హైద్రాబాద్‌లోని భవంతుల్లో "ఇలా జరిగితే" కార్యక్రమం మార్చి నుంచి ఏప్రిల్ వరకు జరుగ లదని, ఫిబ్రవరిలో రమేష్‌నాయుడుగారు పాటలన్ని టిని రికార్డు చేస్తారని, నిర్మాత రాఘవ చెప్పారు

ఇలా జరిగితే? చిత్రంలో మాడాకు యివ్వ బడిన పాత్ర, అతగాడి నట జీవితంలో మలుపుమ తెచ్చేది తథ్యము అన్నారు గడుసరి దాసరి

### జ్యోతిర్మయి ప్రొడక్షన్స్

"నటరత్న" రామారావుగారి భవంతి ఎదురుగా వున్న యింట ఒక చిత్ర నిర్మాణ సంస్థ వెలసింది సంస్థ పేరు జ్యోతిర్మయి ప్రొడక్షన్స్ అధినేత పేరు బొమ్మిసెట్టి హనుమంతరావు

హనుమంతరావుగారు చిత్ర రంగానికి పాతవారే ప్రభుత్వ సత్కారం పొందిన "కాలం మారింది" చిత్రాన్ని నిర్మించినది వీరే

వీరి స్వస్థలం ఒంగోలు అక్కడ అనేక వ్యాపార సంస్థల్లో భాగస్వామిగా వుంటున్నారు నీతి, నిజాయితీ వున్న పెద్దమనిషి

వంగ చిత్ర లోకంలో సంచలనం సృష్టిస్తున్న ఒక చిత్రాన్ని తెలుగులో నిర్మించాలని నిశ్చయించారు ఈ పథకం ప్రకారం అయితే, అగ్ర నటీనటులు పాల్గొనడం తథ్యము అనిపిస్తుంది.

### డైరెక్టర్‌గా ఎడిటర్ సత్యం

ఎడిటింగ్ శాఖలో విశేషానుభవం గడించి, రెండు చిత్రాలకు దర్శకత్వ భారం వహించి, పరిశ్రమలో మంచివాడు అనిపించుకుంటున్న సత్యం ఒక మలయాళ చిత్ర నిర్మాత తలపెట్టిన తెలుగు చిత్రానికి దర్శకత్వం నిర్వహిస్తున్నారు

### శారద అభయం

సత్యం వెళ్లి 'ఊర్వశి' సహాయాన్ని అర్థించాడు సత్యం మంచితనం పట్ల శారద నమ్మకం ప్రకటించి, ఆయన చిత్రంలో నటించడానికి అంగీకరించింది

చిత్ర నిర్మాత పేరు పొన్నప్పన్ మలయాళ భాషలో ఆరు వర్ణ చిత్రాలు నిర్మించి పేరు, డబ్బు గడించారు పొన్నప్పన్‌కు తోడుగా మాధవీకృష్ణ వుంటారు

నిర్మాణ నిర్వహణ కార్యక్రమాలను ఒకప్పుడు శారదగారికి సెక్రటరిగా వుండిన చెల్లప్పన్ నిర్వహిస్తారు



'ఇల్లా—వాకిలి'లో సత్యప్రియ, చంద్రమోహన్

# సినిమా

### కౌముదిలో అక్కినేని !

కౌముదీ అధినేత ఎమ్ ఎస్ రెడ్డిగారు "నటసామ్రాట్" నాయకత్వంలో నిర్మించబూను కున్న వర్ణ చిత్రం విజయా పిక్చర్స్ ద్వారా విడుదల అవుతుంది చాలా సంవత్సరాల తర్వాత అక్కినేని చిత్రం, విజయా పంపిణీ చెయ్యడం జరుగుతూంది

### అక్కినేని చక్రధారి

భక్తి పాత్రలకు పూర్తి న్యాయం చెయ్యగల అనుభవజ్ఞుడు ఎవరయ్యా అని ఆరా తీస్తే నాగేశ్వరరావుగారు కనిపిస్తారు

డిశంబరు నాలుగున, సాయంత్రం నాలుగ్గంట లకు, "నటసామ్రాట్"ను వనేరాలో కలిసిన సమ యాన, ఆయనతో 'గొల్లభామ' తన కథను గూర్చి వివరిస్తున్న నిజాన్ని చూశాను

కృష్ణవేణిగారు చెప్పారు "చక్రధారి"గా అక్కినేని అంగీకరించినట్టు, హీరోయిన్‌గా వాణిశ్రీ ఒప్పుకున్నట్టు, ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మించదలచి నట్టు చెప్పి, "ఇద్దరు మిత్రులు" చిత్రాన్ని కన్నడంలో తీసే వుద్దేశ్యాన్ని వెల్లడించారు

కన్నడ "చక్రధారి"గా రాజకుమార్ నటించా రని, ఆ చిత్రం ఘన విజయాన్ని సాధించిందని ఆవిడ చెప్పారు

### రాజేశ్వరి చిత్ర పాటల కంపోజింగ్

"నటసామ్రాట్" నాగేశ్వరరావుగారు "డాక్టర్ చక్రవర్తి"ని బోలిన ఉదాత్తమయిన పాత్రను రాజేశ్వరీ చిత్ర వారి "మహాత్ముడు" వర్ణ చిత్రంలో పోషిస్తారు

"శృంగారం, కరుణ, త్యాగం నిండిన కోటీశ్వరుడి పాత్ర అక్కినేనిది

"మహాత్ముడు" చిత్రం తాలూకు పాటల కంపోజింగ్ డిశంబరు 14 నుంచి వరుసగా అయిదు రోజులు జరిగింది సంగీత దర్శకుడు చలపతిరావు, కవి దాశరథి కూర్చుని మూడు మాణిక్యాలను సృష్టించారు



### శారద - ప్రభ

"మహాత్ముడు" చిత్రానికి ఆచార్య ఆత్రేయ రచన్ను, జి. వి. సుబ్బారావు కళను, చౌదరి రూపాలంకరణను నిర్వహిస్తారు. అక్కినేని సరసన 'ఊర్వశి'తో బాటు ప్రభ ఒక ముఖ్య పాత్రను పోషించగలదు. నిర్మాత, దర్శకుడు ఎమ్. ఎస్. గోపినాథ్.

### నవత ఆర్ట్స్

"జమిందారుగారి అమ్మాయి" చిత్రాన్ని అందించిన ఎస్. కృష్ణంరాజుగారు కొత్తగా పెట్టిన సంస్థకు యిడిన పేరు నవత ఆర్ట్స్. ఈ సంస్థ జనవరి నుంచి ఒక వినోదభరితమయిన సాంఘిక చిత్రాన్ని తలపెట్టింది.

### ప్రేమించు ప్రేమకై

నవత ఆర్ట్స్ తలపెట్టిన చిత్రానికి "ప్రేమించు ప్రేమకై" అని పేరు పెట్టారు. ఈ చిత్రానికి సంగీతం శ్రీనివాసరావు దర్శకుడు. "జ. గా. అ" చిత్రానికి పనిచేసినవాళ్లు కొందరు "ప్రేమించు ప్రేమకై" చిత్రంలో వుండగలరనేది వార్తను, నిర్మాత కృష్ణంరాజు చెప్పారు. అన్న పూర్ణా విడుదల.

### సింగీతం సుపర్బ్

శివప్రసాద్ మూవీస్ వారి "ఒక దీపం వెలిగింది" చిత్రం రషస్ చూచిన వ్యక్తులు, దర్శకుడు సింగీతంగారి వర్కును సుపర్బ్‌గా పేర్కొన్నారు జాగర్లమూడి రాధాకృష్ణమూర్తి నిర్మిస్తున్న చిత్రంలో జగ్గయ్య, గుమ్మడి, అల్లు రామలింగయ్య, చంద్రకళ, శుభ, రంగనాథ్, కె వి చలం ప్రధాన పాత్రధారులు

మహిళలను ఆకర్షించి, ఆకట్టుకునే శక్తి 'ఒక దీపం వెలిగింది" చిత్రానికి వుంది

### హాలీవుడ్ చిత్రమా

ఎ ఎస్ ఆర్ట్ ఫిలింస్ వారి "కక్ష — శిక్ష" వర్ణ చిత్రం చూసినప్పుడు, హాలివుడ్ చిత్రమా అనిపిస్తుంది కర్ణన్‌గారి ఛాయాగ్రహణం, దర్శ కత్వం, కార్ల యుద్ధం, శృంగారం ప్రేక్షకులను యిట్టే ఆకర్షించగలవు

'జేమ్స్‌బాండ్' జయశంకర్, రాజకోకిల, శకుంతల ముఖ్య పాత్రలను పోషించారు

అంగర సత్యం సమర్పించు "కక్ష – శిక్ష" వర్ణ చిత్రానికి మిద్దె రామారావు, అంగర లక్ష్మణ స్వామి నిర్మాతలు ఈ చిత్రం ఆంధ్రావని హక్కులు బొల్లు నాగేశ్వరరావు (ప్రమీల ఎంటర్‌ప్రైజస్) తనవని చెప్పారు లక్ష్మి ద్వారా విడుదల



'ముగ్గురు మూర్ఖులు'లో ఒక దృశ్యం







## వీరికు ఎవరు కావాలి?

వీరంతా 'యవ్వనం కాటేసింది' చిత్రంలో నటించారు. వీరు నటించిన సన్నివేశాలు త్వరలో మీరెలాగూ వెండి తెరపై చూడబోతున్నారు. ఈలోగా 'యవ్వనం కాటేసింది' లో మీ అభిమాన తార నటించిన సన్నివేశం మీకు చూడాలని వుంటే వ్రాయండి. ఆ యా తారలు నటించిన రసవత్తర సన్నివేశం ఒకటి మీకు శాంపిల్‌గా పంపిస్తాం. సన్నివేశం పంపటమేమిటని అనుమానం రావచ్చు. ఆ సన్నివేశాలు చిత్రీకరింపబడ్డ సినిమా రీలులోంచి ఓ ఫిల్మ్ బిట్ కట్ చేసి పంపిస్తాం. మీరు కోరిన అభిమాన తార యొక్క ఫిల్మ్ ఫ్రేమ్‌తో పాటు 'యవ్వనం కాటేసింది' పాటల పుస్తకం కూడా పంపగలం.

పాటల పుస్తకం థియేటర్‌లో కొంటే 30 పైసలు మాకు వ్రాస్తే మాత్రం ఉచితంగా పంపగలం. అయితే పాటల పుస్తకం, ఫిల్మ్ ఫ్రేమ్ పంపేందుకు వీలుగా స్టాంప్ అంటించిన పోస్టలు కవరు ఒకటి పంపవలసి వుంటుంది.

మీరు ఉత్తరం వ్రాసేటప్పుడు 2 ముఖ్యమైన విషయాలు మర్చిపోవద్దు.

1. 'యవ్వనం కాటేసింది' నటీనటుల్లో మీ అభిమాని ఎవరో వ్రాయవలసి వుంటుంది.

2. మీ ఉత్తరంతో పాటు పోస్టలు కవరు ఒకటి జత చేయవలసి వుంటుంది. పాటల పుస్తకాలు లక్ష కాపీలు మాత్రమే వున్నాయి. అంటే కొన్ని లక్షల మంది ప్రేక్షకుల్లో లక్ష మందికి మాత్రమే పాటల పుస్తకాలూ, ఫిల్మ్ ఫ్రేమ్సూ పంపగలం. నేడే వ్రాయండి.

**శ్యాం ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్, 16A. వళ్లీస్ ఎవెన్యూ, మద్రాస్-83**



'మాంగల్యానికి మరో ముడి'లో ఒక దృశ్యం



'మంచి మారాజు'లో జయసుధ

### మనిషి రోడ్డున పడ్డాడు

ప్రముఖ హాస్య నటుడు రాసిన ప్రయోజనాత్మక మయిన కథ యిది దీనిని చలన చిత్రంగా నిర్మించే బాధ్యతను లక్ష్మి అమ్మలు స్వీకరించారు సహ నిర్మాతలుగా జె వి ఎస్ శాస్త్రి, నాగేంద్ర బాబు, మహేష్‌బాబు వ్యవహరిస్తారు ఈ చిత్రానికి భమిడిపాటి, తాజభద్రు సంభాషణలను రాస్తారు

### స్నేహితునికి ప్రమోషన్ !

చిన్ననాటి స్నేహితుడు, విద్వత్తు వున్న వివేకవంతుడు అగు ఎ వి రమణగారికి దర్శకత్వ శాఖను రాజబాబు అప్పగించారు —

(రమణగారికి అన్ని శాఖల్లో అపార అనుభవం వున్న విజం పరిశ్రమలో అందరికీ తెలుసు )

మనిషి రోడ్డున పడ్డాడు'' చిత్రంలో కొత్తమ్మాయి, అబ్బాయి నాయికా నాయకులుగా నటించగలరని హాస్యరాజు వెల్లడించారు

తమిళ చిత్రాల పాపులర్ జంట శంకర్ — గణేష్ రాజబాబు తలపెట్టిన చిత్రానికి సంగీత సారథ్యం వహిస్తున్నారు

### సీతమ్మ సంతానం !

''పిచ్చోడి పెళ్లి'' చిత్రాన్ని జనరంజకంగా రూపొందించిన కె ఎస్ రెడ్డి యీసారి మరొక కుటుంబగాథ చిత్రాన్ని నిర్మించబూనుకున్నారు చిత్రం పేరు ''సీతమ్మ సంతానం''

### పినిసెట్టి అరవయ్యో చిత్రం

రచయిత పినిసెట్టిగారు కథ, మాటలు రాస్తున్న అరవయ్యో చిత్రం ''సీతమ్మ సంతానం''

మురళీకృష్ణ ఎంటర్ ప్రైజస్ అధినేత మురళీకృష్ణ యీ చిత్రాన్ని ఫిబ్రవరిలో ప్రారంభించడానికి నిశ్చయించారు ప్రముఖ తారాగణం పాల్గొనే యీ చిత్రంలో హీరోది ద్విపాత్రాభినయం

### ప్రసన్న లక్ష్మికి కొత్త దర్శకుడు

''కొత్త కాపురం'' చిత్రాన్ని అందించిన ప్రసన్న లక్ష్మి పిక్చర్స్ మరొక చక్కటి కథను ఎన్నుకుని, ట్రీట్‌మెంట్ తయారీలో నిమగ్నులై వున్న విజాన్ని, నే కళ్లారా చూశాను

నే చూచిన వేళ ఆఫీసులో నిర్మాత వెంకటరత్నం, రచయిత అప్పలాచార్య, మరో ముగ్గురు కథా చర్చ జరుపుతున్నారు

### శివాజీ దర్శకుడు

మా దర్శకుడు త్రిలోక్‌చందర్ అని వెంకటరత్నం వెల్లడించినప్పుడు, సమర్థుడ్ని సెలెక్ట్ చేశారు అని అభినందించాను

తమిళ చిత్ర రంగంలో శివాజీ నటించే చిత్రాలకు త్రిలోక్ దర్శకత్వం వహిస్తారు

ప్రసన్నలక్ష్మి పిక్చర్స్‌కు మహదేవన్ సంగీతాన్ని, పి ఎల్ రాయ్ ఛాయను, చలం కళను, అప్పలాచార్య రచన్ను నిర్వహించగలరు



'బంగారు మనిషి'లో ఒక దృశ్యం

### బ్రహ్మచారికి బిడ్డ ?

సత్యనారాయణ ఒక బ్రహ్మచారి అతడొక మెకానిక్ తన నేస్తం శరత్‌బాబు యింట్లో వుంటూ కాలం గడుపుతుంటాడు బ్రహ్మచారిగా వున్న సత్యనారాయణ జీవితంలోకి అకస్మాత్తుగా ఓ బిడ్డడు ప్రవేశించాడు తల్లెవరో, తండ్రెవరో తెలియని ఆ బిడ్డడికి సత్యనారాయణే తల్లి, తండ్రీ అయ్యాడు ముద్దుగా చూస్తూ, మురిపెంగా పెంచాడు ఆ కుర్రాడ్ని

''ఏ సంబంధం లేకుండా ఆ బిడ్డపై ఎక్కడ్నుంచి వచ్చింది ప్రేమ ఏదో వుంది కాబట్టే వాడ్ని ఊరడిస్తూ, నవ్వూ పూరుకుంటున్నావు'' అంటూ అతని స్నేహితులు పదే పదే చెప్తూ, ఆ కుర్రాడికి తండ్రి అతనే అని నిర్ధారణ చేశారు సత్యనారాయణ ఏమీ చెప్పలేని అయోమయ స్థితిలో ఇరుక్కుంటాడు

బ్రహ్మచారి సత్యనారాయణకు ఆ బిడ్డ ఎలా దొరికాడు ? ఇంతకూ ఎవరా బిడ్డ ! ఈ ప్రశ్నలకు సరైన సమాధానం దొరక్కపోదు మనకు రమాప్రభ సమర్పిస్తున్న కరుణ చిత్ర వారి ''వింత ఇల్లు — సంతగోల'' చిత్రం చూస్తే, అంతు చిక్కని యీ సమస్యకు సమాధానం లభిస్తుంది మనకు కమలాకరరావు, ఆనంద్‌లు నిర్మిస్తున్న ఈ చిత్రానికి దయానందరావు నిర్వహణ రాజబాబు, శరత్‌బాబు, రమాప్రభ, నాగభూషణం, చంద్రమోహన్, ప్రభ, జయమాలిని, గిరిబాబు, ఆర్ నాగేశ్వరరావు కుమారుడు మోహన్, శుభ, కాంతారావు ముఖ్య పాత్రధారులైన ఈ చిత్రానికి పి లక్ష్మీదీపక్ దర్శకుడు తారకరామా విడుదల

— శ్రీనివాస్

### దాసరి స్వీకారం!

ఆనాడు ఆదుర్తి వూహించిన "మాడా"ను యీనాడు నిజంచేసే బాధ్యతను నేటి ప్రజా దర్శకుడు దాసరి స్వీకరించి, ప్రతాప్ ఆర్ట్స్ ప్రొడక్షన్స్ వారి "ఇలా జరిగితే", అరుణ ఆర్ట్స్ ఎక్సర్స్ వారి "ముద్దబంతిపువ్వు" చిత్రాలలో మెయిన్ కమెడియన్ వేషాలను యిచ్చారు

### నటిస్తున్న చిత్రాలు!

ప్రస్తుతం మాడా విఖ్యాత దర్శకుడు విశ్వనాథ్ గారి వద్ద సత్య చిత్ర, హేరంబ చిత్ర మందిర్ సంస్థల్లో ప్రముఖ పాత్రలను పోషిస్తున్నారు

"పద్మాలయా, సురేష్, పద్మజ, శ్రీనివాస ఏజెన్సీస్, శ్యాంప్రసాద్ ఆర్ట్స్ పిక్చర్స్, జయవాణీ ఆర్ట్స్" సంస్థల్లో నవ్వించే పాత్రలను పోషిస్తున్నారు

మాడాకు నీడ అని రాసిన రెండు వత్సరాల్లో మాడాకు 'మేడ' వచ్చే అవకాశం, అదృష్టం వచ్చిందేమో అనిపిస్తుంది *



'కక్ష–శిక్ష'లో కె. విజయ, శివకుమార్

## సంక్రాంతి సమయంలో శారద సైకిల్ రిక్షా పందెం

డిశంబర్ 21వ తేదీ వాసూ స్టుడియోలో ఓ మళయాళ చిత్రం షూటింగ్‌లో పాల్గొంటూంది ఊర్వశి శారద సంక్రాంతి విశేషాలు ఏమైనా వున్నాయేమో తెల్సుకుందామని వాసూ కెళ్ళి, ఊర్వశి శారదగార్ని కలిశాను సెట్‌లో ఒకటే సందడి సంక్రాంతి సంబరాన్ని ఇప్పుడే అనుభవిస్తున్నట్టు కనిపిస్తోందే అన్నాను ఊర్వశిగార్ని చూచి వునండోయ్! సంక్రాంతి అంటే చాలు, చటుక్కున గుర్తొస్తుంది నాకొక సంఘటన అంది శారద సరి ఆ సంఘటన ఏమిటో చెప్పండి అన్నాను నేను ఇలా చెప్పడం మొదలెట్టింది

### పరీక్ష!

అవి సంక్రాంతి దగ్గరపడే రోజులు అందరూ క్రొత్త క్రొత్త కోరికలతో ఆత్రుతను కనపరుస్తూ, సంక్రాంతి ఎప్పుడా! అని ఎదురుచూచే రోజులు సరిగ్గా ఇలాంటి సమయంలోనే ఓ గమ్మత్తు జరిగింది ఆ రోజు నేను, ప్రేమనజీర్‌గారు వాసుమీనన్ (వాసూ స్టుడియో అధినేత)గారు నిర్మిస్తున్న "పరీక్ష" అనే మళయాళ చిత్రం షూటింగ్‌లో పాల్గొంటున్నాము బ్రేక్‌లో అందరం బయట కూర్చొని పిచ్చాపాటీ మాట్లాడుతున్నాము ఇంతలో ఎవరో సైకిల్ రిక్షాలో వచ్చి దిగారు సైకిల్ రిక్షాను చూచి నజీర్‌గారు ఇలా అన్నారు సైకిల్‌ను త్రొక్కడం తేలికే గాని సైకిల్‌రిక్షాను త్రొక్కడం చాలా కష్టం అన్నారు నేను వూరుకోక నే త్రొక్కి చూపిస్తాను అన్నాను హాస్యానికన్న ఆ మాట పందెందాకా వెళ్ళింది

నేను సైకిల్‌రిక్షా త్రొక్కలేనని నూటఒక్క రూపాయలు బెట్ కట్టారు నజీర్‌గారు మాట వరసకు అనేసానేగానీ ఇంత దూరం వస్తుందనుకోలేదు ఏం చేయను! మాట చెప్పి తప్పడం నా కలవాటు లేదు భగవంతుడిమీద భారం వేసి, మొండి ధైర్యంతో సైకిల్‌రిక్షా ఎక్కి, త్రొక్కి చూపించాను. అందరూ అవాక్కయిపోయారు. ఒక అబల ఏమిటి! రిక్షా త్రొక్కడ మేమిటి అనే సందేహం అందరికీ వచ్చింది.

మా నాన్నగారు నాకు మూడేళ్ళప్పుడే, నన్ను, మా అన్నయ్యను, తమ్ముడ్ని అలా సాయంత్రంపూట షికారు తిప్పడంకోసమని రిక్షాలాంటి ఒక బండిని మా ఇంట్లో చేసిపెట్టి వుంచారు నాకు పదవపేడు రాగానే, మా నాన్నగార్కి తెలియకుండా ఆ రిక్షాలాంటి మూడు చక్రాల బండిని త్రొక్కడం అలవాటు చేసుకున్నాను నేను ఆ తర్వాత సైకిల్‌రిక్షా త్రొక్కే అవసరం రాలేదు నాకు చిన్నప్పటి ఆ అనుభవాన్ని గుర్తుంచుకునే ఈ సైకిల్‌రిక్షా పందానికి "సై" అన్నాను నేను, అని అక్కడివాళ్ళకు అసలు సంగతి చెప్పాను పట్టుదల వుండాలేకానీ, ఫలానా పని చెయ్యలేం అనే సందేహమే రాదు అప్పటినుంచీ సంక్రాంతి వచ్చినపుడెల్లా ఈ సంఘటనను తల్చుకుని నవ్వుకుంటాము నజీర్‌గార్ని చూచినపుడల్లా నూటొక్క రూపాయలు జ్ఞాపకం చేస్తుంటాను" అంది ఊర్వశి శారద

మళయాళ చిత్రాలలోని మీ పాత్రలకు, తెలుగు చిత్రాలలోని మీ పాత్రలకు గల తేడా ఏమిటి! అన్న ప్రశ్నకు ఇలా బదులిచ్చింది శారద

### నిర్మాతలా! ప్రేక్షకులా!

మళయాళీస్ టేస్ట్‌కు, మన టేస్ట్‌కు సహస్రం తేడా వుంది వారి భాషా చిత్రాల్లో ఒకే నటి, ఒక చిత్రంలో హీరోయిన్‌గా నటించి, మరొక చిత్రంలో హీరోకు చెల్లెలుగా కన్పించి, ఇంకొక చిత్రంలో హీరోకు అమ్మగా వేషధారణ చేసినా, ఆ చిత్రాలు వారు చూస్తారు ఆ నటిని వారు అభిమానిస్తారు వారు ఒక నటిని, ఒకే దృష్టితో కాకుండా, పాత్రలను దృష్టిలో పెట్టుకుని, నటీనటుల విలువలను తెల్సుకుంటారు

కానీ మన చిత్రాల్లో అలా జరగడంలేదు



అభినేత్రి శారద

అందుకు కారణం చిత్రాలు నిర్మించే నిర్మాతలా! లేక చిత్రాలను పోషించే ప్రేక్షకులా! అనేది అర్థం గాని సమస్యగా మిగిలిపోయింది ఒక నటిని ఒకే దృష్టితో చూడడం ఇక్కడివాళ్ళ అలవాటు ఈ అలవాటును ఇలాగే వృద్ధి చేసుకుంటూపోతే, ఒక నటి తన నటనా ప్రతిభను పలు పాత్రల్లో ప్రదర్శించే అవకాశం తగ్గిపోతుందిగా! ఒకే రకం పాత్రలను పోషించడంవల్ల కొంత కాలానికి ప్రేక్షకులు కూడా విసుగెత్తిపోయి, విమర్శించడం మొదలెడతారు అందుకే మన చిత్ర రంగంలో ఆడవాళ్ళు కొంత కాలం వరకే వుండగలుగుతున్నారు" *

### ముత్తయిదువు

ప్రసన్నలక్ష్మి పిక్చర్స్ (వెంకటరత్నంగారు) నిర్మిస్తున్న చిత్రానికి 'ముత్తయిదువు" అని పేరు పెట్టారు ఏ. ఎ. త్రిలోక్‌చందర్ దర్శకుడు అప్పలాచార్య రచయిత మహదేవన్ సంగీత సారథి

(34 వ పేజీ చూడండి)



'యవ్వనం కాటేసింది'లో ఒక దృశ్యం

"ఎందుకు బావా అంత ఆవేశం ? కుట్ర ఎవరిదో బాగా ఆలోచించు! ఆనాడు మావయ్య మరణశయ్యమీద వుంటే, మీ చెల్లెలు ఆస్థిలో భాగం ఎక్కడ అడుగుతుందోనని, మేం రాకుండానే, ఆస్తంతా నీపేర రాయించుకుని, ఒళ్లు తెలియని స్థితిలో వున్న మావయ్యచేత సంతకం చేయించుకున్నావ్ అది కుట్ర కాదూ ? అదేమిటని అయినవాళ్లు నలుగురూ అడిగితే — 'రాధా సూర్యం ఒక యింటివాళ్లయినప్పుడు అందరి ఆస్థీ ఒకటి కాదా? అని కప్పదాటేశావ్! ఆ తర్వాత ఎన్నిసార్లు పెళ్లి ప్రమేయం తెచ్చినా కుంటిసాకులు చెప్పి తప్పించుకుంటున్నావ్ యిదంతా కుట్రకాదని నువ్ చెప్పగలవా ?"

"శేషగిరీ!" అరచాడు వెంకట్రామయ్య కానీ శేషగిరి మాట్లాడటం మానలేదు

"ఆవేశంగా అరచినంతమాత్రాన అబద్ధం నిజంకాలేదు బావా! ఆస్థిలో భాగం యివ్వలేదని నేనెప్పుడూ అడగలేదు ఇంటల్లుడిగా ఈ యింట్లో నాకు ఆదరణ లభించకపోయినా నేను బాధపడలేదు! కానీ నీ చెల్లెలు శాంతకు నువ్ యిచ్చిన మాటను నిలబెట్టుకుంటావనే యిన్నాళ్లూ అనుకున్నాను! అందుకే మన బంధుత్వాన్ని మరచిపోకుండా నిన్ను యింకా 'బావా' అని పిలవగలుగుతున్నాను పెద్ద వాళ్ల మనస్పర్ధలు పిల్లల భవిష్యత్తుమీద పడగ నీడలా పడకూడదనుకున్నాను" శేషగిరి ఆగాడు

"నిజమే! శాంతకు మాటయిచ్చాను అది ఈనాడు బ్రతికివుంటే తప్పకుండా నా మాట నిలబెట్టుకునేవాడ్ని కానీ కానీ నా ఒక్కగానొక్క చెల్లెలు శాంతను — నువ్వే నాకు లేకుండా చేశావ్ కాదు! హత్యచేశావ్!" వెంకట్రామయ్య ధోరణి శేషగిరికి నచ్చలేదు

"ఏమిటి బావా నువ్వనేది ?"

"శాంత మరణానికి కారణం నువ్వేనంటున్నాను బాగా ఆలోచించు దానికి 'క్షయ' వ్యాధనే సంగతి చివరి ఘడియ వరకూ నువ్ యెందుకు దాచిపెట్టావ్ ? పట్నం తీసుకెళ్లి పెద్ద డాక్టర్లకు చూపించి వైద్యం చేయించివుంటే, నా చెల్లెలు నాకు మిగిలేది! కానీ నువ్ డబ్బు మనిషివి! డబ్బు ఖర్చయిపోతుందని దాని రోగాన్ని దాచిపెట్టావ్! ఆ విషయం నాకు ముందుగా తెలియచేస్తే ఎంత డబ్బయినా ఖర్చుపెట్టి శాంతను బ్రతికించుకునేవాడ్ని ఏనాడయితే నా చెల్లెలు నాకు లేకుండా పోయిందో — ఆనాడే మన బంధుత్వాలు తెగిపోయాయి అంతే!"

వెంకట్రామయ్య మాటలకు శేషగిరి చిన్నగా నవ్వేడు ఆ నవ్వులో ఏదో నిర్లిప్తతా, నిర్వేదం నిండివున్నాయి

"శాంత నీకు చెల్లెలే కావచ్చు బావా! కానీ నాకు భార్య! కష్టంలోనూ సుఖంలోనూ మేమిద్దరం కలసి నవ్వుకున్నాం ఒకసారి శాంతకు జ్వరం వచ్చి — ఆ జ్వరంలో దగ్గుకూడా వస్తే ఆస్పత్రికి తీసుకెళ్లాను. మామూలుగా వచ్చిన జ్వరమేననీ, ఆ జ్వరంలో అలా దగ్గుకూడా రావచ్చుననీ డాక్టర్ చెప్పాడు ఆయన చెప్పిన మందులన్నీ వాడాం కానీ ఫలితం కనిపించలేదు మరో పెద్ద

# మనుగడలో మలుపులు

(24 వ పేజీ తరువాయి)

డాక్టర్కు చూపించాను అప్పటికే పరిస్థితి చేయి దాటిపోయింది అక్కడికీ నాకున్న ఎకరం నేలా అమ్మి మదనపల్లి తీసుకెళ్లి వైద్యం చేయిస్తానని నచ్చచెప్పాను 'ఉన్న నేలకాస్తా అమ్మి మన సూరీడుకి అన్యాయం చెయ్యొద్ద'ని బ్రతిమలాడింది శాంత! 'పోనీ మీ అన్నయ్య కుత్తరం రాయనా ?' అనికూడా అడిగాను అభిమానంలో నాకంటే మరో మెట్టు పైనే నిలబడిన శాంత అందుకూ నిరాకరించింది! అంతే కాలప్రవాహంలో కలసిపోయింది" నిట్టూర్చాడు శేషగిరి

మౌనంగా విన్నాడేకానీ మాట్లాడలేదు వెంకట్రామయ్య ఏదో గుర్తుకువచ్చినవానిలా మళ్లీ శేషగిరే అన్నాడు

"శాంత కోరికమీద ఆ చివరి ఘడియల్లో

**జరిగిన కథ 3.** తన చిన్ననాడే తమతో సంబంధం తెంపుకున్న మేనమామ వెంకట్రామయ్య యింటికి వచ్చిన సూర్య ప్రకాశరావు తనెవరో చెప్పకోవాల్సి వచ్చినందుకు బాధపడ్డాడు వెంకట్రావ్ భార్య వర్ధనమ్మ కూతురు రాధ తన తల్లి బ్రతికున్నపుడే తన పెళ్లాంగా ముద్ర వేయించుకున్న రాధ ఎలా వుంటుందో తెలీకపోయినా ప్రాణప్రదంగా ప్రేమిస్తాడు సూర్యం సూర్యానికి రాధ నిచ్చి పెళ్లి చేయటం తన కిష్టం లేదని వెంకట్రామయ్య వర్ధనమ్మతో అంటున్న మాటలు వింటాడు సూర్యం వెంకట్రామయ్య మనస్తత్వం తెలుసుకున్న సూర్యం ఆ వూరి నుంచి వచ్చేస్తాడు కమతగాడైన తనను ఆదిశేషయ్య అల్లుడుగా చేసుకోవటం, భార్య శాంత మరణం, వెంకట్రామయ్య ప్రవర్తన అన్నీ గుర్తు తెచ్చుకుంటాడు శేషగిరి

నీకు ఉత్తరం రాస్తే — నువ్వొచ్చినప్పుడు శాంత ఎంత ఆనందించిందో నీకు గుర్తుందా బావా ? 'రాధ నా యింటికోడలుగా రావాలి అన్నయ్యా' అంటూ దీనంగా నిన్ను అడిగినప్పుడు ఆమె చేతిలో చెయ్యేసి బాస చేశావ్! జీవంలేని నా శాంత కళ్ళల్లో — ఆ క్షణాన కనిపించిన తృప్తీ ఆనందమూ నాకు ఎప్పటికీ గుర్తుంటాయ్!" అన్నాడు అతని కళ్ళల్లో నిలచిన కన్నీటిచుక్కలు క్రిందకు జారి పడేలా వున్నాయి

"గతాన్ని మాటిమాటికీ త్రవ్వి తలకేసుకోవటం నాకు అలవాటులేదు! అయినా రాధను నేను సూర్యానికి యిచ్చి చెయ్యలేను! రాధ ఓ కలవారింటి కోడలుగా వెళ్లాలి! అక్కడ అడుగులకు మడుగులొత్తే పని మనుషులుండాలి! కాలు నేల మీద పెట్టనివ్వక, కారులో తిప్పగలిగే హోదా వున్న భర్త కావాలి! ఎంత కట్నమయినా పోసి రాధకు అలాంటి సంబంధమే తెస్తాను ఇంక మీవాడి చదువు విషయ మంటావా — రాధ పెళ్లి జరిగేవరకూ నేను ఎటువంటి సహాయమూ చెయ్యలేను!.." నిష్కర్షగా అన్నాడు వెంకట్రామయ్య

శేషగిరి కుర్చీలోంచి లేచాడు టేబిలు మీద అంతకు ముందు పెట్టిన తన చేతిసంచీని తీసుకుని, బరువుగా ఓసారి నిట్టూర్చి "అయితే మంచిది బావా — వస్తాను" అంటూ బయటకు నడిచాడు

మధ్య గది గుమ్మం దగ్గరే నిలబడి చూస్తున్న వర్ధనమ్మ క్షణంలో తేరుకుని —

"భోజనమయినా చేసి వెళ్లండి అన్నయ్యగారూ" — అంది ఒకడుగు ముందుకు వేసి

"వద్దమ్మా బంధుత్వాలు తెగ్గతెంపులు చేసుకున్న తర్వాత మర్యాదలకు అర్ధం వుండదు"— అన్నాడు శేషగిరి

వడివడిగా అడుగులేస్తూ వెళ్లిపోతున్న శేషగిరి మలుపు తిరిగేవరకూ — గుమ్మంలోనే నిలబడి చూస్తూ వుండిపోయింది వర్ధనమ్మ!!

## 6

అందమైన అనుభవం కాకపోయినా, రాధ సాంగత్యం కలిగించిన మధురానుభూతి మనసును ఆనందడోలికలలో వూగిస్తూంటే, సిరిపురం వెళ్లిన తండ్రిని గురించి ఆలోచిస్తూ కూర్చున్నాడు సూర్యం

మేనమామ అహంభావం, రాధ అమాయకత్వం, మేనత్త ఆదరణ, రాజు మూగప్రేమ, మళ్లీ మళ్లీ గుర్తుకువస్తూంటే తండ్రి వెళ్లిన దగ్గర్నుంచీ స్థిమితం లేనివాడిలా పగలంతా గడపిన సూర్యం, స్థిరంలేని ఆలోచనలతో రాత్రికూడా గడిపాడు చల్లగా అరుణకిరణాలు ఆవరిస్తున్నవేళ మత్తుగా నిద్రపోయాడు

వెచ్చని కిరణాలు వెన్ను తడుతూంటే, బద్ధకంగా అటు వత్తిగిలిన సూర్యం తలుపు చప్పుడుకి విసుగ్గా లేచాడు

తలుపుతీసి, తండ్రిని చూసి తలమునకలుగా ఆశ్చర్యపోతున్న సూర్యాన్ని తప్పించుకుని లోపలకు నడిచాడు శేషగిరి తలుపు పట్టుకుని నిలబడిపోయిన సూర్యానికి తండ్రి అనుకున్నరోజుకంటే త్వరగా తిరిగిరావటంలోని అంతరార్ధం అర్ధమైన వెంటనే నిరసం ఆవహించినట్లయి, నిస్సత్తువ చేసింది

తను అనుమానించినదంతా అయిందను కున్నాడు అమాయకత్వం పూర్తిగా వీడని ఆకు చాటు పిందెలాంటి రాధకోసం తను బాధపడటం అర్ధంలేనితనమని తన మనసుకు తనే సర్దిచెప్పకున్నాడు

కేవలం, తెగిపోయిన బాంధవ్యంకోసం - తన తండ్రి అవమానాల పాలవటం కొంత బాధ కలిగించినా, వెంటనే ఆ బాధని దూరం చేసుకోగలిగాడు సూర్యం

రక్తసంబంధం త్రెంచుకోవటం మామూలు మనుషులకు అంత తేలికకాదు అందుకే శేషగిరి అంతగా మథనపడిపోతున్నాడు

ఆ విషయం గ్రహించిన సూర్యం తండ్రిని తనే ముందుగా పలకరించాడు

"ఏం నాన్నా! ఏమిటి విశేషాలు ? మావయ్య ఏమన్నాడు? రాధ కనిపించిందా ?" లేని ఉత్సాహం కనబరుస్తూ మాట్లాడుతున్న సూర్యాన్ని నిశితంగా చూశాడు శేషగిరి

"నిజం చెప్పరా! నా కళ్లల్లోకి చూసి చెప్పు! నువ్ యిదివరకు సిరిపురం వెళ్లినప్పుడు మావయ్యసీతో ఆదరంగా మాట్లాడాడా?" అడిగాడు.

సూర్యం తల వంచుకున్నాడు.

"తెలిసీ - నేను వెడుతూంటే నాకు మాట మాత్రంగానైనా చెప్పివుంటే – అవమానాన్ని ఎదుర్కోవటానికి తయారై వెళ్లివుండేవాడిని." అన్నాడు శేషగిరి.

"లేదు నాన్నా! చిన్న ఆశ వుండివుండకపోతే మిమ్మల్ని అసలు వెళ్లనిచ్చేవాడినేకాదు. అమాయకమైన రాధ అందం అందనిదే అని తెలిసినా, ఆశ నన్ను మాట్లాడనియ్యకుండా చేసింది."

"మీ మావయ్యకి అందచందాలతో గుణగణాలతో పనిలేనట్టుంది! కేవలం ఆస్తి లేదనేగా మనతో బంధుత్వాన్ని త్రెంచుకున్నది! అసలు మీ మావయ్యకి అంత ఆస్తి ఎలా వచ్చిందో అందుకు రెక్కలు ముక్కలయ్యేలా ఎవరు కృషి చేశారో గుర్తు లేనట్టుంది! పైగా నాదంతా కుట్రట! నేనే అంత కుట్ర చేసివుంటే మనం ఈనాడిలా వుండే వాళ్లమా? ఆస్తినంతా మీ తాత, నా అజమాయిషీలో వదిలినప్పుడు, ఈ మనిషి ఎక్కడోవుండి చదువుకునేవాడు. ఆ పరిస్థితుల్లో నేనేం చేస్తే ఎవరికి తెలుస్తుంది? నిజాయితీగా, అంతా తిరిగి అతని చేతికి అప్పగించినందుకేగా చివరికిలా అవమానించాడు? బంధుత్వమే లేదని తెగేసి చెప్పాడు!" శేషగిరి బాధగా అన్నాడు.

"పోనీలెండి నాన్నా! వాళ్లకిలేని బాధ మనకెందుకు? మన అంతరాత్మలముందు ఎప్పటికీ తలవంచి నిలబడక్కరలేకుండా మన ప్రయత్నం మనం చేశాం. అయినా యిప్పుడు మనకేం తక్కువ? నేనుహాయిగాఉద్యోగించేస్తాను. స్వేచ్ఛగావుండచ్చు."

"నిన్ను డాక్టర్ని చెయ్యాలని నువ్ పుట్టినప్పటి నుంచీ అనుకున్నాం. మీ అమ్మ మనసూ, నా ముచ్చటా తీరకపోతాయా అని ఇన్నాళ్లూ ధైర్యంగా

## మనుగడలో మలుపులు

అనుకున్నాను. తీరా ఆ సమయం వచ్చేసరికి అది ఎండమావిలా దూరమైపోయింది." అని ఓ క్షణం ఆగి ఏదో ఆలోచన వచ్చినవానిలా –

"పోనీ మన యకరంనేలా అమ్మేస్తాను! నువ్ చదువుకో" అన్నాడు శేషగిరి.

"అదికూడా లేకుండాపోతే – మనదీ అని చెప్పుకోవటానికి ఏదీ వుండదు." సూర్యం వారించాడు.

"ఫరవాలేదురా! అసలు మీ అమ్మ ఆఖరి క్షణాలమీద వున్నప్పుడే అది 'అమ్మేస్తా' నన్నాను. 'ఆ కాస్త నేలయినా మన సూరీడుకోసం ఉంచండి' అందిరా మీ అమ్మ! ఇవాళ అది నీ చదువుకోసం వుపయోగపడితే మీ అమ్మ ఆత్మ శాంతిస్తుంది!"

"ఎందుకు నాన్నా! నీ పిచ్చిగానీ ఇప్పుడెలాగా ఒక డిగ్రీ వచ్చిందికదా? మళ్లీ మరో అయిదారేళ్లు చదువంటే నాకే విసుగనిపిస్తుంది! హైదరాబాద్ వెళ్లానంటే ఏదో ఒక ఉద్యోగం దొరక్కపోదు. అక్కడే రాజారాంగారు కూడా వున్నారు కనుక మనకు మరీ తేలిక. మీరైనా ఎన్నాళ్లని యీ పనులు చెయ్యగలరు? నాకు ఉద్యోగం దొరకగానే మీరూ విశ్రాంతి తీసుకోవచ్చు. ముందే రాజారాంగారికి చెప్పివుంచుతాను 'ఈలోపునే మీరు మరో నమ్మకస్తుడ్ని చూసుకోండి' అని!" సూర్యం మాటలు అంతగా రుచించని శేషగిరి అన్నాడు.

"ఏమోరా! నువ్వూ నాలాగే ఎదిగీ ఎదగని జీవితంతో రాజీపడతానంటూంటే - నా మనసు ఎందుకో ఒప్పుకోవటంలేదు. మనకి ఏమీ లేదనేగా మీ మావయ్య మనల్ని ఇంత తేలిగ్గా తీసిపారేసింది? కేవలం మనిషిని చూసి మనిషిలోని మంచితనాన్ని చూసి ఆదరించే రోజులు పోయాయి! డబ్బున్నవాడే దేవుడు ఈ రోజుల్లో."

"మీకెందుకు నాన్నా! మీరు అలాగే చూస్తూండండి! అదృష్టం బాగుండాలేకానీ అందలం ఎక్కటం ఎంతసేపు! [illegible] మనల్ని కాదన్న మావయ్యే మన దగ్గరకు రాకపోడు!" అంటూ కాలకృత్యాలు తీర్చుకుందుకు వెళ్లిపోయాడు సూర్యం.

కొడుకు గుండెనిబ్బరానికి శేషగిరి యెంతో ఆనందించాడు.

తండ్రిగా చెప్పవలసిన జాగ్రత్తలన్నీ పదే పదే చెప్పి, ఆ మర్నాడే కొడుకుని ఉద్యోగానికి హైదరాబాద్ పంపించిన శేషగిరి నిశ్చింతగా నిట్టూర్చాడు!!

### 7

సిరిపురంలోని ఓ మోస్తరు రైతులందరూ యిప్పుడిప్పుడు మోతుబరులయిపోతున్నారు.

అంతకుముందు ఆ వూరిని గురించి చెప్పుకోవాలంటే ఆదిశేషయ్య ప్రాభవంతో మొదలయ్యేది. వెంకట్రామయ్య పెత్తనం చేపట్టి చేను ముఖమైనా చూడకపోయినా, ఆదిశేషయ్య హయాం నుంచి పనిచేస్తూవచ్చిన కమతగాళ్లు, ఇంకా ఆయన్నే తలుచుకుంటూ పాటుబడుతూండటంచేత, వెంకట్రామయ్య పేరు మాపుబడలేదు.

కానీ, పొగాకులాంటి వ్యాపారపు పంటల్లో బాగా కలసొచ్చిన ఆ ఊరి ఓ మోస్తరు రైతులందరూ వున్న కొద్ది పొలంలోనే బాగా ఆర్జించారు. ఆ డబ్బుతో నాగరికతను కొనుక్కున్నారు! పొలాలు అరకలతో దున్నటం మానేసి ట్రాక్టరుకి మొహం వాచిపోతున్నారు. ప్రతి పనికీ పట్నం పోకపోతే తోచని పరిస్థితికి వచ్చారు.

కానీ ఆదిశేషయ్య ఒకప్పుడు హుందాగా తిరిగిన లోగిలి అలాగే వుంది! మూడరకల ముచ్చటైన ఎడ్లతో మరొకరి సహాయం లేకుండా, తన పొలమంతా సాగవుతూంటే వెంకట్రామయ్య గర్వపడ్డాడు. ఆనవాయితీగా వస్తున్న గంగిగోవు గొడ్లచావిడిలో చిందులు వేస్తూనేవుంది.

అది వెంకట్రామయ్యగారి గొప్పతనం కాదని అందరికీ తెలుసు. (ఇంకా వుంది)

# సంక్రాంతికి ఓ చిరునవ్వు - (శంకర్)

అందుకనే - డాక్టరుగారు మిమ్మల్ని నా వెంటరమ్మంది.

మామా మామా వచ్చేశాం!!






## టాపిక్ ఆఫ్ ది డే . . .

పట్నాల్లో గొబ్బెమ్మ లెక్కడ పెట్టాలి? పబ్లిక్ పాయిఖానా లాంటి గుమ్మాల్ని దయతలచి మునిసిపాలిటీవారు పది గంటల వేళకి ఊడ్పిస్తే కద్దు లేకపోతే లేదు రోడ్డుమీదకి చూస్తూ ఏ వికారాలు రాకుండా నడవకలిగితే పట్నాల్లో వాటి మీద వూడ్చి కల్లాపి చల్లి ముగ్గు లెట్టినంత ఫలితం అసలు పది గంటలకైతేగాని పారిశుధ్యపు పనివారికి తెల్లారదు అబ్బా! ఎన్ని ఉమ్ములు! ఎన్ని యివీ! ఎన్ని అవీ! కడుపులో ఏమీ లేకుండా మన మహానగరాల రోడ్లమీద నడవాలే తప్ప లేకపోతే హైరోడ్లమీద కక్కుకోమూ? అంట కల్చర్ సంగతి సరే రోడ్లు వూడ్చి ముగ్గులు పెట్టే కాలంలో హెల్త్ ఆఫీసరూ, సానిటరీ యిన్‌స్పెక్టర్ మునిసిపాలిటీ — సదరు టాక్సులూ గట్రా లేవుకదా అప్పటిదీ కల్చర్ కాని యివాళ అంటే పాపం వస్తుందేమో గాని వీధుల శుభ్రత వాళ్ల బాధ్యత కదా? — యీ గుమ్మాలు వూడ్చే అలవాటు గమ్మత్తయింది మనం యిలా వెళ్తాంటాం యిస్త్రీబట్టలు తొడుక్కుని —

## సామాన్యుని సణుగుడు

ఒక హోటలు కుర్రాడు కోటానుకోట్ల పాదధూళి క్రిములు గల గోనెపట్టాని తెచ్చి రోడ్డు మధ్య వో దులుపు దులుపుతాడు 'దీం దుంప తెగిరి యింతకన్నా యీ వూరిమీద ఎక్కడినించైనా తెచ్చి ఆటమ్‌బాంబు వెయ్యకూడదూనాయనా!' అందా మనిపిస్తుంది

ఇంకో దుకాణం ముందు అర్జంటుగా ధూళి మేఘాలు సృష్టిస్తూ వూడ్చేస్తూంటాడు మరో కల్చరల్ ప్రతినిధి ఆ తర్వాత నీళ్లు — జల్లేస్తూంటాడు ఆ దారిన పోయేవాళ్లు ఆ దుమ్ముకి, ధూళికి, నీళ్లకీ వారసులైనట్లు అనుభవించవల్సిందే కాకా హోటేలు కాకాగార్లు టీ గ్లాసులు కడిగి "ఛళ్ల"న ఎంతో లాఘవంగా యెంగిలినీళ్లు రోడ్డు మీదికి విసిరేస్తూంటారు వాటికి అడ్డం వెళ్తే మనం, వాళ్లదా తప్పు? మేడలమీది యిల్లాండ్రు చెత్తా చెదారం తెచ్చి ఆకాశంలో మేఘాలేవో సందేశాలు యిస్తూవుంటే వాటిని వింటూ వున్నట్లు పైకి చూస్తూ క్రింద పోయేవాళ్ల నెత్తిన పోసేస్తారు తుక్కు క్రింద కల్లాపి చల్లి ముగ్గులు పెట్టే యిల్లాండ్రు పట్నాల్లో వూడ్చవలసిన దేమిటో తెల్సును గనుక పనిమనుషుల మీద యీ సంస్కృతిని కాపాడే భారం తోసేస్తారు వాళ్లేమో యీ యింటి 'పని అమ్మాయి' ఆ యింటివేపు, ఆమె యిటువేపు ఆ చెత్తనూ నెట్టేసిపోతారు! కల్లాపికీ గొబ్బెమ్మలకీ పేడ ఎక్కడ? దానికీ వెల వుంది ఉలాంటప్పుడు ఫర్ గెట్ ది కల్చర్ లెస్ట్ సివిలిజేషన్ అండ్ స్పాయిల్ ది రోడ్, జాయిన్ ది మెజారిటీ ఇంతకీ యీ సంక్రాంతికి మార్నింగ్ షోతో విడుదలయ్యే బైస్కోపు లెన్ని? అదికదా మన టాపిక్ ఆఫ్ ది డే లెటజ్ సీ ది స్పెషల్ యిష్యూస్ ఆఫ్ ది డైలీస్ **[విరాజి]**

## తల్లి — తండ్రి

(22వ పేజీ తరువాయి)

ఆ తల్లి జాలిగుండె కరిగి నీరయింది

"లేమ్మా! లే!"

సంధ్యను భుజాలతో పొదివి పట్టుకుని లేపారు అన్నపూర్ణమ్మగారు

"నన్ను మన్నిస్తావా అమ్మా!"

"పిచ్చిపిల్లా! లెమ్మంటున్నాగా లే!"

తల్లి మాటల్లోని ఆప్యాయత సంధ్యకు ధైర్యం చేకూర్చింది ముఖ మెత్తింది సంధ్య కళ్ళు ఉబ్బి ఉన్నాయి, ముఖం వాచి ఉంది

"పెళ్లికి ముందే ప్రేమించి, వయసు ఆడించినట్లుగా అతనితో జత కట్టి ఆడిన నన్ను మన్నిస్తావా అమ్మా! పెద్దల అనుమతి ప్రసక్తి లేక, మనసు కోరినట్లుగా అతనికి జీవితం పంచి ఇచ్చిన నన్ను క్షమిస్తావా అమ్మా!"

"పిచ్చిపిల్లా! తల్లి బిడ్డను క్షమించట మేమిటి? బిడ్డలో తల్లికి తప్పు కన్పించదమ్మా!"

తల్లీ బిడ్డల అనుబంధాన్ని కొత్త కోణంలో నిర్వచిస్తున్న అన్నపూర్ణమ్మ గారిలో సంధ్యకు మూర్తీభవించిన మానవత్వం గోచరించింది

క్లాసుమేటును ప్రేమించా నన్నంతవరకే విని, ఆ తర్వాత ఒక్క మాటా వినకుండా రామనాధంగారు విసరిన కసురుకు బెదిరిపోయిన సంధ్య, అన్నపూర్ణమ్మ గారికి తను చెప్పదలుచుకున్నదంతా చెప్పింది కాని మరి ఒక్క విషయం మాత్రం దాచింది అది చెప్పే ధైర్యం లేక ఇప్పుడా దాచిన విషయం మానవత్వం ముందు మోకరిల్లుతోంది

"అమ్మా! భాస్కర్ మన కులం కాదమ్మా! అయినా నన్ను క్షమిస్తావా?"

కొమ్మన వున్న పండు అందుకున్న పిల్లవాడు అది కోసుకున్న తర్వాతే తృప్తిచెందేది! ఈలోగా ఏదీ అడ్డురాకూడదు. సంధ్య పరిస్థితి అలాగే వున్నది అందిన స్వర్గం జారదుకదా! తల్లివంక ఆదుర్దాగా చూసింది

"మీ మనసులను కలిపినది ప్రేమ మీ జీవితాలను నడిపేది పవిత్రమయిన ఆ ప్రేమ మాత్రమే ఇక కులాల ప్రసక్తి ఎందుకు తల్లీ!"

అన్నపూర్ణమ్మగారి మాటలలో పరుచుకున్న హృదయ వైశాల్యానికి అవధులు కన్పించటంలేదు

"మరి నాన్నగారు"

"నేను చెప్పి ఒప్పిస్తాగా నీ సుఖమే మా సుఖం ధైర్యంగా వుండమ్మా!"

అన్నపూర్ణమ్మగారిలో సంధ్యకు అభయమిచ్చే దైవత్వం కన్పించగా ఆ అద్వైతమూర్తి ముందు మోకరిల్లింది ఆనందభాష్పాలు ఆ తల్లి పాదాలను అభిషేకిస్తున్నాయి

[అంతర్జాతీయ మహిళా సంవత్సరం సందర్భంగా ఈ కథ — బిడ్డ చేష్టలో తప్పు చూడని "తల్లి"కి — అంకితం

— రచయిత]

## సినిమా

(29వ పేజీ తరువాయి)

### 1975లో మన చిత్రాలు, సాధించిన విజయాలు

*పాఠకులకు కొత్త సంవత్సర శుభాకాంక్షలు*

గత ఏడు విడుదలయిన చిత్రాలు 54, (డబ్బింగ్ కాకుండా) వీటిలో విజయం సాధించిన చిత్రాలు యిరవైకి రెండు తక్కువ కనిపిస్తున్నాయి (34 శాతం అన్నమాట)

స్టార్‌వేల్యూ లేకుండా, కథాబలంతో, దర్శకుని చాతుర్య బలంతో అమోఘ విజయాన్ని సాధించిన చిత్రాలు రెండున్నాయి ఒకటి "స్వర్గం—నరకం" రెండు "ముత్యాల ముగ్గు"

**హిట్ చిత్రాల నాయకుడు**

1975లో హిట్ చిత్రాల నాయకుడుగా 'నటరత్న' రామారావుగారిని, శోభన్‌బాబుగారిని పేర్కొనవచ్చు నందమూరి నటించిన 'శ్రీ రామాంజనేయ యుద్ధం, సంసారం, అన్నదమ్ముల అనుబంధం, ఎదురులేని మనిషి' చిత్రాలు అత్యధిక లాభాలను ఆర్జించిపెట్టాయి

శోభన్‌బాబుగారు నటించిన "దేవుడు చేసిన పెళ్లి, జీవనజ్యోతి, బలిపీఠం, జేబుదొంగ, సోగ్గాడు" చిత్రాలు ప్రేక్షకులను ఆకర్షించాయి

**ఉత్తములు ఎవరు?**

"బలిపీఠం"లో శోభన్‌బాబు, "దేవుడులాంటి మనిషి"లో కృష్ణ, "సంసారం"లో రామారావు, "జీవన జ్యోతి"లో వాణిశ్రీ, "బలిపీఠం"లో శారద, "పిచ్చోడి పెళ్లి"లో విజయనిర్మల, "మా వూరి గంగ"లో లక్ష్మిగార్లు ఉత్తమనటనను ప్రదర్శించారు

**ప్రత్యేక ప్రశంసలు!**

"స్వర్గం — నరకం"లో ఫినిష్ పాత్రధారి దాసరిని, "ముత్యాల ముగ్గు"లో రావు గోపాలరావును, "మా వూరి గంగ"లో సత్యనారాయణను ప్రత్యేకంగా అభినందించాలి

**"సంగీతం దర్శకత్వం"**

"జేబు దొంగ"లో చక్రవర్తి, "దేవుడు చేసిన పెళ్లి"లో చలపతిరావు, "ముత్యాల ముగ్గు"లో మహదేవన్, "యశోదా కృష్ణ"లో రాజేశ్వరరావు మధురమైన సంగీతాన్ని వినిపించారు

దర్శకత్వంలో దాసరి, బాపు, విశ్వనాథ్‌గార్లు తను ప్రత్యేకతను ప్రదర్శించారు

— శ్రీనివాస్















BRITANNIA
Glucose-D
ఇప్పుడు ఆకర్షణీయమైన కొత్త ప్యాక్‌లో



# బలహీనత

ముద్దంశెట్టి హనుమంతరావు

గుర్నాథం తమ మీద మేనేజరుకి లేనిపోని చాడీలు నేర్పుగా చెప్పి, బాగా చీవాట్లు పెట్టించాడు అటువంటి గుర్నాథంకి గుణపాఠం చెప్పాలి. అతణ్ని అవమానించాలి .. అదే యెలా? వెయ్యిచేసుకుంటే, మళ్ళీ ప్రమాదంలో యిరుక్కోవాల్సి వస్తుంది. అయితే, యెలా అవమానించడం? ...

ఇదే జగన్నాథం మురాలో వున్న మొత్తం నలుగురికీ పట్టుకున్న పెద్ద సమస్య నలుగురి మెదడులూ యెంత చురుగ్గా, వేడిగా, వాడిగా పనిచేస్తున్నా, పరిష్కారమార్గం యే ఒక్క మెదడుకి తట్టలేదు సిగరెట్టుమీద సిగరెట్టు కాల్చిపారేస్తున్నారు.

"అయిడియా వచ్చింది" అంటూ హుషారుగా అరిచాడు — యేదో గొప్ప కీలక సమస్యని సాధిస్తున్నంత గర్వంగా, జగన్నాథం.

"ఏవిట్రా అది?" అక్కడున్న ముగ్గురూ సుమారు ఒకేసారి-అడిగారు ఆసక్తిగా.

"మనం యెవరిమీద దెబ్బతీయాలన్నా, మొదట అతని బలహీనత లేవిటో కనిపెట్టాలి మన గుర్నాథం బలహీనత లేవిటంటారు?" ఎదురు ప్రశ్న వేశాడు జగన్నాథం.

ఆ ముగ్గురూ చాలా నిరాశతో వెనక్కి పేరబడిపోయారు.

"బలహీనతలేవిటంటే, యెలా చెప్పడం? అతనికి డబ్బుమీద వ్యామోహం యెక్కువ." అన్నాడు, మోహన్.

"చెప్పుడు మాటలు సుళువుగావింటాడు" రంగారావు చెప్పాడు.

"సినిమాలు తెగ జూస్తాడు" విశ్వం అన్నాడు.

జగన్నాథం, మెల్లగా నవ్వేడు... ఓ సిగరెట్టు తీసి ముట్టించాడు.

"మీ మొహం. ఇవన్నీ నిజమైన బలహీనతలు కావు"

"మరేవిటంటావు?"

"అలా అడగండి చెబుతా! గుర్నాథంకి మత్తుమందు తీసుకోడం, ఒక బలహీనత. బ్రాందిగాని, విస్కీగాని చూశాడా, ఒళ్లు మర్చిపోతాడు..."

"ఔను అది నాకూ తెలుసుననుకో! అయితే, యేం చేద్దామని?" అన్నాడు మోహన్.

"ఇటువంటి ప్లాన్లు వెయ్యాలంటే, చురుకైన మెదడుండాలిరా?"

"ఆ మెదడు నీకు వుందనే గదరా, నిన్ను నాయకుడిగా యెన్నుకున్నాం మన గ్రూపులో? ఇంతకీ, నీప్లాను యేమిటో చెప్పకూడదూ?" విశ్వం అన్నాడు

"చెప్పేవరకైనా కాస్త ఆగండిరా మరి! మనం చిన్న పార్టీ యేర్పాటు చెయ్యాలి."

"ఏం పార్టీ?"

"బుడ్డి పార్టీరా బాబు! అదీచెప్పాలా"

"నాకు అలవాటు లేదురా! "రంగారావు కంగారుగా చెప్పాడు

"ఫ-వాలేదు లేరా! అలవాటు లేకపోతే, కొస్తంత రుచి చూద్దువుగాని .. దానికోసం పెద్దగా కంగారు పడిపోనవసరం లేదు..."

"అది సరేగాని, ఎక్కడ ఏర్పాటు చెయ్యాలని?"

"గుర్నాథం ఫామిలీ లేనట్టుందిలే! వాడింట్లోనే ఏర్పాటు చేద్దాం"

"గుర్నాథం ఒప్పుకుంటాడా? మనల్ని చూస్తేనే వాడికి మంట.." తనసందేహాన్ని వెలిబుచ్చాడు, విశ్వం.

"అబ్బ! అరంభంలోనే హంసపాదేమిటి బాబూ! గుర్నాథంని ఒప్పించే బాధ్యత నా మీద వదేయండి..."

"సరే! నీ యిష్టం... అతణ్ణి ఒప్పించే బాధ్యత నీదే! ఎట్లాగయినా గుర్నాథంని మనం అవమానించాలి అదే మన ధ్యేయం."

"మనధ్యేయం విజయవంతమౌతుంది ... చూస్తూవుండండి" ధైర్యంగా చెప్పాడు. మిగిలిన ముగ్గురి మొహాలూ ప్రకాశవంతమయ్యాయ్

* * *

"నమస్కారం గుర్నాథంగారు"

"నమస్కారం జగన్నాథంగారు. ఏవిటిలా విచ్చేశారు?" ఆశ్చర్యంగా అన్నాడు గుర్నాథం.

"అబ్బే! యేంలేదండీ మిమ్మల్ని యెప్పుడు కలుద్దామన్నా, మీరు యేదోపనిలో



# బలహీనత

వుంటున్నారు ఇవ్వాళ దొరికారు..."

"చెప్పండి"

"చలికాలం రానేవచ్చింది మేం ఓ చిన్న విస్కీపార్టీ యేర్పాటు చేసుకొన్నామండీ మన మోహన్, రంగా, విశ్వం ఒకటేపోరు పెడు తున్నారు. మీరు మాతోపాటు వుండాలని. సరేనని మిమ్మల్ని ఒప్పించే బాధ్యత నా నెత్తిన వేసుకున్నాను. కాదనకండిసార్." ప్రాధేయపూర్వకంగా అన్నాడు జగన్నాథం.

ఆ మాట వినేసరికి, గురుర్నాధంకి వొళ్ళు పులకరించింది విస్కీ తీసుకుని చాలా రోజు లయ్యింది...అయితే నలుగురికంట పడకుండా వుండాలి

"సరేనండీ దానికేముంది మీ రింత అభిమానంతో చెబుతావుంటే, కాదంటానా. కాని ఒక్కవిషయం"

" ఏమిటండీ " ఆసక్తిగ అన్నాడు జగన్నాథం.

"ఇంకెక్కడో యెందుకు మా ఫామిలీ లేదు కదా ప్రస్తుతం మా ఇంట్లోనే యేర్పాటు చెయ్యండి." వెదకబోయిన తీగె కాళ్లకి తగిలి నట్టయ్యింది జగన్నాధంకి.

"అంతకంటే కావల్సిందేముంది సార్, మీ యింట్లోనే ఖాయంచేస్తాను. కొన్ని గంటలు సరదాగా గడిపేయొచ్చు."

"నా వాటా డబ్బు యేమాత్రం పడు తుందో చెప్పండి యిచ్చేస్తాను" అన్నాడు గుర్నాధం.

జగన్నాధం మెల్లగా నవ్వేడు "అమ్మమ్మ మీ దగ్గర డబ్బు పుచ్చుకోవడమా ? మీరు మాకు అతిథిగా వుంటారు. ఏర్పాట్లన్నీ మేంచేస్తాంలెండి. వస్తోన్న ఆదివారమే!"

"అలాగే!"

"వస్తానండీ!"

"మంచిది"

జగన్నాధం ముందుకు సాగిపోయాడు. అతని హృదయం ఆనందంతో వూగిసలాడింది. తాను యెదురుచూసే రోజు దగ్గర పడు తుందన్న సంతోషం అతణ్ణి వడిగా నడిపించింది.

* * *

ఆ రోజు ఆదివారం —

రాత్రి గుర్నాధం ఇంట్లో చాలా హడావిడిగా వుంది ఏర్పాట్లన్నీ జగన్నాధం బృందమే చేస్తున్నారు పొగడ్తలతో గుర్నాధంని ఆకాశానికెత్తారు. అతనిలాంటి మంచివాడు ఆ వూళ్ళోనే లేడన్నారు. అతనితో కాలం గడపడమే ఒక అనుభూతి–అన్నారు ... ఇలా అతణ్ణి పొంగించి, విస్కీ కాస్త యెక్కువ డోస్‌లోనే అతనికి పోశారు. గుర్నాధం, అదంతా తనమీద అభిమానానికి చిహ్నం అను కున్నాడు. ఏవిధమైన ఆలోచనలూ లేకుండా తాగేశాడు. దేనికయినా హద్దుండాలి కదా! డౌనైపోయాడు. కుర్చీలో వెనక్కి వాలి పోయాడు.

గుర్నాధం మత్తుమైకంలో వుండటమే

జగన్నాథం బృందానికి కావల్సింది. తాము కోరుకున్న పరిస్థితికి రాంగానే పుప్పొంగిపోయారు. అంతకుముందే అనుకున్న విధంగా నలుగురూ చేతులు కలిపి, గుర్నాధం జుత్తును పరమవికారంగా అగుపించేటట్టు కత్తిరించారు.

"అమ్మయ్య! ఇప్పటికి మన గుండెలు చల్లారాయిరా!" అన్నాడు తృప్తిగా, జగన్నాథం.

మిగిలిన ముగ్గురూ సంతోషంతో జగన్నాథం అభినందిస్తూ కరచాలనం చేశారు.

మరి కొద్దిసేపటికి గుర్నాధంకి మత్తు వదులుతున్నట్టనిపించింది ... బరువెక్కిన కళ్ళను తెరవడానికి ప్రయత్నిస్తున్నాడు. ఇంక తాము వెళ్ళిపోవడం మంచిదనుకొని లేచారు

"వస్తాం గుర్నాధంగారు!" అని తట్టి చెప్తూ "తలుపు గడియ వేసుకోండి..." అన్నాడు జగన్నాథం.

వాళ్ళు బయటికి వెళ్ళాక, గుర్నాధం తలుపు గడియ పెట్టి, మంచంమీద ఒరిగాడు.

* * *

తెల్లవారింది బద్ధకంగా వొళ్ళు విరుచుకుని లేచాడు గుర్నాధం తలదువ్వుకోడానికి నిలువుటద్దం ముందుకి వెళ్ళి నిలబడేసరికి అసహ్యంగా కత్తిరించబడివున్న జుత్తును చూసి గతుక్కుమన్నాడు ఇదేమిటి? ఇదెలా జరిగింది? .. చప్పునవెళ్ళి రాత్రి కూచున్న చోట చూశాడు. కత్తిరించబడిన జుత్తు అక్కడక్కడా అగుపించింది. నిర్ఘాంతపోయాడు ఇప్పుడవగాహనయ్యింది, యేం జరిగిందో! జగన్నాథం బృందం, తనని అవమానపర్చడానికే యీ పార్టీ యేర్పాటు చేసినట్టు యిట్టే గ్రహించేశాడు వాళ్ళు చేసిన మోసానికి పళ్ళు పటపట కొరికాడు కాని యేం లాభం? వాళ్ళని ఎలా నిందించడం? అడిగితే నవ్వుతారు... నవ్వితే. తాను మరింత కృంగిపోవాల్సి వస్తుంది ఇంతకీ, యీ జుత్తుతో ఎట్లా బైటికి వెళ్ళడం?... మరో ఆలోచన లేకుండా ఎప్పుడో తిరుపతిలో కొన్న టోపీ తీసి తగిలించుకుని, సెలూన్‌కి వెళ్ళి, పూర్తిగా గుండు చేయించుకున్నాడు.

టోపీ తగిలించుకొని తిరుగుతున్న గుర్నాధంని చూసి, జగన్నాథం బృందం నవ్వుకున్నారు గుర్నాధం వొళ్ళు కుంచించుకుపోయింది వీళ్ళు ఎప్పుడైనా తన గుప్పెట్లోకి

## స్వాగతి

శనగన నరసింహస్వామి

మంచులో తడిసిన మందిరాంగణ మెల్ల
సింగార మొలికించు రంగవల్లి
పంట కళ్లంబులో పైడిటంకము లట్లు
తళతళల్ వెదజల్లు ధాన్యరాశి
వీధివీధుల హర్షవీచుల ముంచెత్తు
సాతానిజియ్యరు శ్రావ్యగీతి
తోటలో నిండుగా తులకించి తియ్యని
పరిమళంబులు చిమ్ము బంతివిరులు

కోడి పుంజుల "కొక్కురోకో" రవాలు
కలికి కన్నెల గొబ్బి పాటల పసందు
ప్రతిపదంబున స్వాగత భవ్య వచన
రచన మెరయించెరమ్మ! సంక్రాంతిలక్ష్మి!

**2**

సమసమాజ వినిర్మాణ సంనివిమగ్న
భారతోర్వర శుభ పరంపర సుమింప
నాడిదుడుకు లేని పథమునందుజ్జ్వలనవ!
రథవరము పైన సర్వ సమ్రాజ్ఞి! రమ్ము

## బ ల హీ న త

కావాలి . అప్పుడు తన తడాకా చూపిస్తా... అనుకున్నాడు

"నమస్కారం గుర్నాథంగారూ!" ఆ బృందం ఒక్కసారే అన్నారు. .

"చాల్లెండి . ఈ బోడి నమస్కారాలూ మీరూను..." కోపంగా అని, విసురుగా వెళ్లిపోయాడు.

జగన్నాథం బృందం నవ్విన నవ్వులు, అతని గుండెల్లో అంకుశాలు గుచ్చుకున్నట్లుగా బాధించాయి. కాని, ఏం చేస్తాడు!

'ఏమిటి గుర్నాథంగారూ టోపీ తగిలించారు?' అని యెవరైనా అడిగితే "తిరుపతి వెళ్లొచ్చానండీ!" అని తడుముకోకుండా చెప్పేవాడు గుర్నాథం.

ఆరోజు నుంచీ మళ్లీ యెవరైనా పార్టీ' అని పిలిస్తే చాలు, కస్సుమనేవాడు గుర్నాథం.

# డాక్టరు సలహాలు

డాక్టర్ కె. వెంకటేశ్వరరావు

**పి. వి. ఆం. ఖమ్మం**

మా అమ్మగారికి ఫామిలీ ప్లానింగ్ ఆపరేషన్ చేయించాము. దాని తరువాత కడుపులో గడ్డ అయినది దానికి మళ్లీ ఆపరేషన్ చేయించాము. ఆపరేషన్ అయిన మూడవ రోజునుండి మూత్రము 24 గంటలూ ఏక ధాటిగా పోవటము ప్రారంభమయినది ఆపరేషన్‌లో డిఫెక్టు కనుగొనటానికి ఐ వి పి అనే ఎక్స్‌రే తీసారు. మళ్లీ చిన్న ఆపరేషన్ చెయ్యాలన్నారు. ఇది శస్త్ర చికిత్సతో నయమయ్యే మార్గముందా? లేక మందులతో పోతుందా?

ఇలా రెండవ సారి ఆపరేషన్ జరిగిన సమయములో మూత్రసంచికి జననేంద్రియాలకు ఒక కృత్రిమ మార్గమేర్పడి వుంటుంది దీనిని మూసి వేయటానికే మరొక సారి ఆపరేషన్ చెయ్యాలన్నారు. ఈ రోగం, ఆపరేషన్ వలననే నయమవుతుంది గాని, మందులవల్ల నయం కాదు.

**టి. ఆర్. ఎస్. మదనపల్లి.**

నా వయస్సు 23 సం లు నా భార్య వయసు 15 సం లు మా పెళ్లయి 7 నెలలు అయినది పెళ్లయిన నెల తరువాత నెలతప్పినది అబార్షన్ చేయించినాము మరల 3 నెలల తరువాత నెల తప్పినది. అప్పుడప్పుడు కడుపునొప్పి ఆకలి ఎక్కువవున్నది గర్భధారణకు వయసు పరిమితి ఉన్నదా? దీనివలన బాధలేమైనా ఉన్నాయా?

గర్భధారణకు వయసు పరిమితి అంటూ తప్పకుండా ఉన్నది 15 సం.ల నుంచి 45 సం లవరకు (స్త్రీల వయసు) గర్భంధరించగల అవకాశంఉన్నది. అనవసరంగా అడపాదడపా అబార్షను చేయించుకోవటంవల్ల శరీరానికి హాని కలుగుతుంది. పైగా తల్లికి ప్రమాదం కూడాను!

లేడీ డాక్టరుల చేత పరీక్ష చేయించి, ఇకమీదట మీ కనవసరం అనుకొంటే గర్భధారణ జరగకుండా చూసుకోవటం ఉత్తమం!

**కె. జి. ఎమ్. విజయవాడ**

నత్తి వున్న వారికి బెంగుళూరులో చికిత్స గలదని వ్రాశారు. ఆ డాక్టరు అడ్రస్ తెలుపకోరెదను.

★ ఈ చికిత్స ప్రత్యేకంగా వ్యక్తిగతంగా ఒకరు మాత్రమే నిర్వహించటంలేదు

"ఆల్ ఇండియా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ స్పీచ్" అని మైసూరులో ఒక సంస్థ ఉన్నది. మైసూరుకి వెళ్లి, అడిగితే ఎవరైనా చెప్పగలరు.

అక్కడ ప్రత్యేకంగా నత్తిగల వారికి మెరుగుపడే అవకాశాలు సాధనాలు ఉన్నాయి.

# వారఫలం

## మహేష్

16-1-1976 శుక్రవారం మొదలు
22-1-1976 గురువారం వరకు

**మేషం.—** స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి పోటీవారిలో గౌరవం లభిస్తుంది వృత్తిలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది వారం ఆఖరులో మీరు అనుకొనేది ఒకటి జరిగేది మరొకటి కావచ్చును స్త్రీలకు — పుణ్యకార్యాలు చేస్తారు ఎవరితోనూ వాద ప్రతివాదాలు తగవు

**వృషభం:—** వ్యాపారంలో అనుకూల వార్తలను వింటారు ప్రయాణాలు ఫలిస్తాయి మీ కార్యక్రమాలు హడావుడిగా ఉంటాయి ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది ముందు లాభించగల వ్యవహారాల్లో అభివృద్ధిని సాధిస్తారు. వృత్తిలో ఆదాయం పెరుగుతుంది స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి

**మిధునం —** నూతన వ్యవహారాలు లాభిస్తాయి రావలసిన డబ్బు అందుతుంది అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి సజ్జన సాంగత్యం లభిస్తుంది మీ మంచితనమే మీకు ఇబ్బందిని కలిగిస్తుంది స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి దైవకార్యాలు నెరవేరతాయి

**కర్కాటకం —** వృత్తి వ్యాపారాలు అనుకూలంగా ఉంటాయి మీ ప్రయత్నాలు ఫలిస్తాయి ప్రయోజనం గల పరిచయాలు ఏర్పడతాయి విద్యా వైజ్ఞానికరంగాల్లో ఖ్యాతి లభిస్తుంది ప్రయాణాలు ఫలిస్తాయి మిత్రులకు సహాయం చేస్తారు స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది సంతోషకరమైన వార్తలనువింటారు

**సింహం :—** మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి వ్యతిరేకమైన వార్తలను వింటారు వారం మధ్యలో ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. వృత్తిలో ఆదాయం బాగుంటుంది ప్రయోజనం గల సంభాషణలను జరుపగలరు స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కన్య —** వృత్తిలో ఆదాయం బాగుంటుంది ప్రయాణాలు ఫలిస్తాయి వారం మధ్యలో శ్రమ కలుగుతుంది మీ తాలూకు వస్తువులు పోవచ్చును వారం ఆఖరులో అన్ని వ్యవహారాల్లోను అనుకూలత లభించగలదు స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది

**తుల:—** అన్ని వ్యవహారాల్లోను గౌరవం బాగా ఉంటుంది సజ్జన సాంగత్యం లభిస్తుంది. సాహసిక వ్యవహారాలు బాగుంటాయి వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి వారం ఆఖరులో ప్రయోజనం లేని శ్రమ కలుగుతుంది స్త్రీలకు— బంధుమిత్రులను కలుసుకుంటారు అధిక వ్యయం జరుగుతుంది

**వృశ్చికం —** నూతన వ్యవహారాలు లాభిస్తాయి. మిత్రులకు సహాయం చేస్తారు స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి ప్రయోజనం గల సంభాషణలను జరుపగలరు మీరు యిదివరకు చేసిన ప్రయత్నాలు ఫలిస్తాయి స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి

**ధనుస్సు —** లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును అనవసరమైన వ్యయం చేస్తారు. వారం మధ్యలో ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది పుణ్యకార్యాలు చేస్తారు

**మకరం .—** మీ ఆలోచనలు ఫలిస్తాయి రావలసిన డబ్బు అందుతుంది వారం మధ్యలో ఆందోళన కలుగుతుంది. సాహసిక వ్యవహారాల్లో నష్టం వస్తుంది వారం ఆఖరులో మీ కార్యక్రమాలు బాగుంటాయి ప్రయాణాలు ఫలిస్తాయి స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు. వినోద కార్యక్రమాల్లో పాల్గొంటారు.

**కుంభం :—** అనవసరమైన సందేహాలు కలుగుతాయి వృత్తిలో పోటీవారి పోటీ పెరుగుతుంది. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి ప్రయోజనం గల వ్యక్తులను కలుసుకుంటారు వారం ఆఖరులో చికాకులు ఏర్పడతాయి స్త్రీలకు – కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి ఆడంబరం కోసం వ్యయం చేస్తారు

**మీనం :—** ప్రయాణాలు ఫలిస్తాయి విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది మీ కార్యక్రమాలకు మార్పులు రాగలవు భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు లాభిస్తాయి. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. దైవకార్యాలు నెరవేరతాయి

## రాలిన ముత్యాలు

......శ్రీ సోమసుందర్......

కవిత్వానికి — మనన భావన
ధారణ లనేవి జీవగ్రరలు
గాఢత సాంద్రత చిన్మయత
లనేవి మూడూ ముఖ్యంగాలే !

# ఫాలాక్షుని డైరీ




## మరచిపోయిన మాస్టర్ల జీతాలు

నిరుద్యోగ సమస్యను రూపుమాపే సత్యయత్నం సందర్భంగా, ఐదు లక్షల మందికి వుద్యోగాలిచ్చే పథకం క్రింద నెల ఒక్కింటికి నూట డెబ్బయి అయిదు రూపాయల జీతంతో పని చేస్తున్న పట్టభద్రులయి, ట్రెయినింగు కూడా అయిన ఉపాధ్యాయులు తమకు గత ఎనిమిది నెలలు జీతాలు లేవోచ్ అని రాష్ట్ర ప్రభుత్వానికి నివేదించారట. ఈ వుపాధ్యాయులు విశాఖజిల్లాకు చెందినవారట ఇంతేగాక ఎయిడెడ్ స్కూళ్లలో పని చేసే వుపాధ్యాయులకు తొమ్మిది నెలల నుంచి కరువుభత్యం చేతికి రావటం లేదట అంతేగాక, జీతం పెంచుతూ సవరించిన కొత్త స్కేళ్ళు ఇంత వరకూ అమల్లోకి రాలేదట ఇవన్నీ రాష్ట్ర ప్రభుత్వానికి ఎరిగించారట అంటే!! తెలియని విషయం చెప్పినట్టా! కాదు మర్చిపోయారేమోనని గుర్తు చేసినట్టనుకోవచ్చా!!

## డబ్బుకోసం భార్య అమ్మకం

వీరభద్రకరుప్పయ్యన్ అనే వో 28 ఏళ్ళ వుత్సాహవంతుడు నీకు ఎంచక్కటి వుద్యోగం దొరుకుతుంది పద అని తన భార్యను బొంబాయి తీసుకు వెళ్లి అక్కడ ఆమెను వో వ్యభిచార గృహానికి యాభయి రూపాయలకు తెగనమ్మాడట. ఈయనకు చట్టం వో ఏడాది కఠినశిక్షతో పాటు రెండొందల రూపాయలు అపరాధం కూడా విధించిందట రెండొందలు కట్టగలిగే వోపికున్న వాడయితే తన భార్యను యాభయి రూపాయల కమ్ముకుంటాడా!!

### మొసళ్లపాలైన ప్రయాణీకులు

జకార్తా ప్రాంతంలో వో నదిలో నలభయి రెండుమంది ప్రయాణం చేస్తున్న వో మోటారు బోటు ప్రమాదవశాన్న మునిగిపోయిందిట. నదిలో పడ్డ ఆ నలభయి రెండు మందినీ మొసళ్లు పట్టుక కరకర నమిలి మింగేశాయిట.

### అదృశ్య హస్తం

హిందీనటి లీనాచంద్రవార్కర్‌కు యిటీవలే వివాహం అయ్యింది మొన్న 19 వ తేదీ రాత్రి లీనా భర్త సిద్దార్ధబందోర్కర్ తన పడకగదిలో వున్నట్టుండి కెవ్వున కేక వేశారట అదేమనిచూస్తే ఆయన పొట్ట చేత్తో పుచ్చుకుని, మెలి తిరిగి పోయాడట. పిస్తోలు పేలి ఆయన పొట్టలోకో గుండు దూసుకు పోయిందట ఆ సమయంలో పడగ్గదిలో ఆయన ఒక్కడే వున్నాడట. లీనా పక్క గదిలో వుందట. ఇంతకూ పిస్తోలు ఎలా వచ్చింది ఎలా పేలింది, ఎందుకు పేలింది! దీని భావమేమో యింకా తెలియలేదట ఆసుపత్రిలో శస్త్రచికిత్స చేసి, పొట్టలోనిగుండును బయటకు లాగారట

### 'కోవిద్' పట్టా పుచ్చుకున్న ఖైదీలు

నాగపూరు సెంట్రల్ జెయిల్లో ఉన్న ఖయిదీలలో నామదేవ్‌తుకారామ్ వంజారీ అనే అతను, యశ్వంత్‌రావ్ బాలాజీ అనే అతనూ శిక్ష అనుభవిస్తూనే చదువుకున్నారట. విదర్భ రాష్ట్ర భాషా ప్రచార సమితి ఏర్పాటు చేసిన క్లాసులకు వారు జెయిల్లోనే హాజరయి, పరీక్షలు రాసి "కోవిద్" అనే పట్టా పుచ్చుకున్నారట. అనగానేమి!

## అవలక్కి

కావలసిన వస్తువులు:—మరమరాలు 1శేరు నీరుల్లిపాయలు చిన్నవి 2, పచ్చిమిర్చి— అగినన్ని, పచ్చి శనగపప్పు కొద్దిగ, మినపప్పు కొద్దిగా, ఆవాలు, కరివేపాకు, పసుపు.

తయారుచేయు విధానము —అవలక్కి తయారు చేయటానికి 5 నిమిషములు ముందుగా మరమరాలు నీళ్ళలో పోయాలి తరువాత ఉల్లిపాయలుచీలికలుగా కోసి, పచ్చిమిరపకాయలు చిన్న ముక్కలుగా కోసి అట్టేపెట్టుకోవాలి. కొంచెం మందపాటిగిన్నెలో నూనె వేసి, కాగినతరువాత పచ్చిశనగపప్పు, మినపప్పు (ఇవి రెండూ మామూలు తిరగమోతలోకంటే కొంచెం ఎక్కువ వేసుకుంటే బావుంటుంది. వేసి వేగిన తరువాత ఆవాలువేయాలి. అవి చిటపటలాడే






టప్పుడు కరివేపాకు వేసి తరువాత కోసివుంచినఉల్లి మిరప ముక్కలు వేయాలి. అవి వేగిన తరువాత మరమరాలు నీళ్ల నుండి పిండి ఇందులో వేసే తగినంత ఉప్పు పసుపు వేసి అడుగు అంటుకో కుండా త్రిప్పుతూ వుండాలి. మరమరాలు వేసిన తరువాత పొయ్యి మీద 2 నిముషాలు వుంచితే చాలు దించబోయే ముందు కొంచెం నెయ్యివేయాలి ఇష్టమైనవారు నిమ్మరసం కూడా పిండుకోవచ్చున ఇది వేడిది తింటే చాలా రుచిగా వుంటుంది

తక్కువ ఖర్చుతో, తక్కువ టైములో ఎక్కు శ్రమ లేకుండా అన్ని రకాల వారూ చేసుకొనటాని ఉపయోగపడుతుంది.

ఇది కన్నడులు ఎక్కువ మక్కువతో చేసుకొ టిఫిను

—కె వి మణి

## అవీ—ఇవీ—అన్నీ

సి సి హెరాల్డ్

రంగానికి సంబంధించిన విశేషాలతో చిత్రాలతో డెమ్మీ సైజులో 10 పేజీల ఈ పత్రిక వెల 60 పైసలు వివరాలకు సిటీ హెరాల్డ్ పంజాగుట్ట హైదరాబాద్ 500004

**మేష, వృషభ లగ్నములు**

శ్రీ వేంకటేశ్వర జ్యోతిష గ్రంథమాలవారు రెండు పుస్తకాలు మా కార్యాలయం చేరాయి. గ్రంథకర్త దైవజ్ఞరత్న విద్యావిశారద శ్రీదివాకరుని వేంకటసుబ్బారావు ఆయా లగ్నముల స్వభావాలు జాతకుల సహజ లక్షణాలు స్థిత గ్రహ ఫలములు మహాయోగములు గ్రహముల భావ స్థితి యుతి దృష్టి ఫలములు ధన విద్య యోగములు ఉన్నాయి. ఒక్కొక్కదాని వెల 3 రూపాయలు మిగతా లగ్నముల గురించిన గ్రంథములు కూడా నెలకొక్కటి చొప్పున వెలువడుతాయి. ప్రతులకు వివరాలకు గ్రంథకర్త 7 చక్రపాణి వీధి, మదరాసు 600033 అన్న చిరునామాకు రాయాలి.

5

## మిణుగురులు

(16వ పేజీ తరువాయి)

'శాంతమ్మ!' అంటూ ఒక రోజు ...మెల్లగా బందరు నుంచి తెనాలివచ్చి దరి ఇంట్లో అడుగు పెట్టాడు శేషయ్య.

శాంతమ్మ కొంచెం విస్తుపోయింది భర్త పోయినప్పుడు కర్మాంతరాలకు వచ్చి వెళ్లాక బావగారు మళ్లీ ఒక్కసారి అయినా వచ్చి బాగోగులు విచారించలేదు తమ్ముడు పోయాక అతని సంసారం ఏ రీతిగా సాగుతోందో కనీసం ఒక్క ఉత్తరంముక్క అయినా వ్రాసి కనుక్కుందామన్న యోచన ఆయనకి లేక

ంది. అలాంటి వ్యక్తి ఇలా అకస్మా గా ఊడి పడటంలో ఉన్న ఉద్దేశ్యం ఉంటుందా అనుకుంటూ ముందు గది వచ్చి గోడవారగా నిల్చుని– 'పదిగంటల కి వచ్చారా బావగారూ! అక్కగారికి గ్లో కులాసాగా వుందా' అని అడిగింది మ్మదిగా

'ఆఁ. ఏం కులాసాలే అమ్మాయ్! దాని గ్యగం సంగతి నీకు తెలీనిదేముందీ. ఈ క్య పది రోజులు పడకేసి లేచింది' న్నడు బైట వరండాలో కుర్చీలో కూచున్న య్య.

'గటి గా మందిప్పించాలి బావగారూ! అలా ాడు మూణ్ణాళ్లకీ జబ్బు చేస్తుంటే ండ మరీ బలహీనం అయిపోదూ!' అంది ంతమ్మ

'ఇప్పటి కెంతమంది డాక ర్లో చూడటం న్నో మందులు వాడటం అయింది కదా దాని ఆరోగ్యం అంతే!' అన్నాడు శేషయ్య, మ్మ లోపలినుంచి తెచ్చిన మంచినీటి గ్లాసు ందుకుంటూ.

శేషయ్యగారు మంచినీళ్లు పుచ్చుకుంటూ ంషగా ప్రభాకరం ఊళ్లోనుండి వచ్చాడు తనిచేతిలో ఏదో కవరూ కొన్ని కాగితాలూ న్నాయి. గుమ్మంలోంచే శేషయ్యని చూసి శ్చర పడ్డాడు. చకకగా నడుస్తూ వచ్చి రండాలో ఉన్న ఓ కుర్చీ లాక్కుని శేషయ్య దురుగా కూచుని–'ఏమండీ మావయ్యగారు ప్పుడూ రావటం' అని అడిగేడు.

'ఇంతకు ముందే' అన్నాడు శేషయ్య ాళీచేసిన గ్లాసు కింద పెట్టేస్తూ.

'అత్తయ్యగారు బాగున్నారా'

'ఏదో అలాఉంది.'

వాళ్లిద్దరూ మాటల్లో పడటం చూసి కాంతమ్మ లోపలికి సర్దుకుని భోజనానికి ఏర్పాట్లు చేయసాగింది.

'ఇప్పుడు ఇంటికి వస్తూ మిమ్మల్ని అను కుంటూ వచ్చాను.' అన్నాడు ప్రభాకరం

'ఏమిటి విశేషం?' అడిగేడు శేషయ్య!

'ఏమీలేదండీ, బందరులో ఓ ఉద్యోగానికి ఈరోజే నేను దరఖాస్తు పంపించేను. ఇంట ర్వ్యూకి అక్కడికి రావల్సివస్తుంది బందరు అనగానే మీరు గుర్తుకొచ్చారు' అంటూ ాగేడు ప్రభాకరం.

'అన్నట్టు నీ ఉద్యోగ ప్రయత్నాలెలా ఉన్నాయి' కను ఁమ్మలు ఎగుర వేస్తూ

...ండిగేడు శేషయ్య'

'ఏమంత ఆశాజనకంగా లేవండీ పరీక్షలు ...ాయటం ఇంటర్వ్యూలకి హాజరవటం. ... తర్వాత సెలెక్టు కాకపోవటం ఇలా చాలా ...లమట్టీ జరుగుతోంది. మరి ఇదెలా

## మిణుగురులు

అవుతుందో' అన్నాడు నిరుత్సాహంగా ప్రభాకరం.

'ఏం ఉద్యోగాలో ఏమో ...' అంటూ శేషయ్య ఇంకేవిటో మాట్లాడబోతూండగా లోపలనుంచి భోజనాలకి లెమ్మని పిలుపు వచ్చింది శేషయ్య, ప్రభాకరం ఇద్దరూ కుర్చీల్లోంచి లేచారు.

[ఇంకా వుంది]



### గమనిక

"మినీయింటర్‌వ్యూలు" అనేవి టపాలో వస్తే వాటిని స్వీకరించి వేయడం సాధ్యంకాదని మా యువ పాఠకులకు మనవి ... సం.




**Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3. Editor. S. Radhakrishna**

# ఇంటి గుమ్మాన్నిచూచి ఇంటిని చెప్పుకోవచ్చు



**విశ్వప్రేమి:**
ఇంటికి అందరూ రావాలి అంటుంది. కొలువు అయిన తరువాత ఆవిడచావడి శుభ్రంగాతీర్చి దిద్దినట్లుంటుంది.





**విశ్వప్రేమి:**
వాస్తవంగా అతిథులను ఆహ్వానించడం తెలుసు. చీకూచింతా వుండదు. ఇల్లు ఎప్పుడూ శుభ్రంగా ఉంటుంది.






**విశ్వప్రేమి:**
ప్రతీవ్యక్తికి ప్రేమతో స్వాగతము పాలవాడికి కూడా.





**విశ్వప్రేమి:**
కొడుకు స్నేహితులందరూ కాళ్లుతుడుచుకొని వస్తారు లోపలకు





**స్వాభిమాని:**
కూపస్థమండూకము గుమ్మలలోకి ఎవరు వచ్చినా విసుగు. ధూళి, మన్ను తెస్తారని గొణుగుతుంది.



ఇరుగుపొరుగువారి దగ్గరనుంచి ఈపడ కొన్ని విషయాలు నేర్చుకోవచ్చు — ఉదాహరణకు కాళ్లుతుడుచుకొనే కోయర్ డోర్ మ్యాట్సు వాటి ఉపయోగము.

## కోయర్ డోర్ మ్యాట్సు

ఎంతతొక్కినా అందంచెడని డోర్ మ్యాటులు



కోయర్ బోర్డు
కొచ్చిన్ 682016

త్వరగా కోయర్‌కి అలవాటు పడండి దగ్గరి కోయర్ డీలర్ దగ్గరికివెళ్లి కోయర్ బోర్డు షోరూమ్ & సేల్స్ డిపో, బొంబాయి, న్యూఢిల్లీ, కలకత్తా, మద్రాసు, బెంగళూరు, కొచ్చిన్, మధురై, ఛండీఘర్, భువనేశ్వర్, పాట్నా, హైదరాబాదు, మరియు దేశమంతటా అనుమతిపొందిన కోయర్ డీలర్లు

SISTA'S CB 4/75 TEL

జగపతి సిబ్బంది సంక్షేమార్థం నిర్మించబడిన చిత్రం



జగపతి స్టాఫ్ ఎంటర్‌ప్రైజెస్

# పిచ్చిమారాజు

ఈస్ట్‌మన్ కలర్

దర్శకుడు

వి.బి.రాజేంద్రప్రసాద్

నిర్మాతలు వి.ఎస్.రెడ్డి , ఎస్.ఎస్.రామమూర్తి



ANNAPURNA

సోల్ డిస్ట్రిబ్యూటర్స్

అన్నపూర్ణా పిక్చర్స్

అన్నపూర్ణా ఫిలింస్ రిలీజ్

సంగీతం: కె.వి.మహదేవన్ ఫొటోగ్రఫీ: ఎస్.వెంకటరత్నం W.I.C.A. మాటలు: సత్యానంద్ పాటలు: ఆచార్య ఆత్రేయ కళ: ఎస్.కృష్ణారావు

alpana